# అనసూయ



చలం



# అనసూయ

చలం

ప్రజాప్రచురణలు
ఏలూరు

3 7-71




* అనసూయ
* వేదాంతం
* వాణీ - ఏ స్టడీ
* ముక్తిమార్గం
* ఎరికలమ్మ
* నేనేంచేశాను?

5

# పుట్టిల్లు

గదిలోకి అపరాహ్నపు ఎండ తలుపులోంచి వొచ్చి పచ్చని చాపలాగు పరుచుకుంది. మెల్లిగా సూర్యుడు మంచంకోళ్లని తాకుతున్నాడు. సరిగా మంచంకోళ్లని తాకేప్పటికి డాక్టరొస్తాడు. ఎట్లా తెలుస్తుంతో సరిగా ఆ నిమిషం ? గడియారంలో చూచుకుంటాడు. గడియారానికిమాత్రం ఎట్లా తెలుస్తుందో ? తనకికూడా అట్లాంటి గడియారం వుంటే చేతికి, అనుకుంటోంది జబ్బుగా పడుకున్న అనుసూయ. అట్లాంటి ఆలోచన లన్నా లేకపోతే అసలు యిరవైనాలుగు గంటలూ ఏమీతోచదు. రాత్రు లన్నా నిద్రరాదు. ఆమె ప్రపంచంలో ప్రస్తుతం మసులుతున్నది మామూలు అమ్మా కొత్త డాక్టరూ.

ఈ డాక్టరు వొచ్చి కదలడు. ఒకటే వాగుతాడు. ఒక్కొక్క జబ్బు మనిషి దగ్గిర అంతసేపు కూచుంటే, యింటి కెప్పుడు చేరు కుంటాడు ?..........మంచివాడేనేమో ! ఆ రబ్బరు గొట్టంతో తన వీపూ రొమ్మూ పరీక్షచేసి యేదో వింటాడు. ఆ గొట్టం జేబులోంచి తియ్యగానే తనకి చక్కలిగిలిలాగుంటుంది. రెండుచేతులతో దాన్ని నిన్న తోసేసింది. అతను నవ్వుతో 'గొట్టం పెట్టనియ్యకపోతే చెవిపెట్టి వింటాన'న్నాడు. ఒకవేళ యెప్పుడన్నా గొట్టం మరిచిపోయి రాడుకద ! 'జరంలేదు. యింకా లేవలేదా ?' అనేసరికి జబ్బు పోయినట్లే వుంటుంది. మంత్రం పెడతాడా యేమిటి ? యింకెంతసేపటికి వొస్తాడో యీవాళ ? బూడ్సులు

చప్పుడు జేసుకుంటో- యిజారూ. చక్కా కోటూ. హైట్, యెంత బావుంటాయో ! వూరికే చిరునవ్వులు నవ్వుతాడు. యింకా రాడేం ! జావలోకి పచ్చడి నంచుకోవచ్చేమో అడగాలని వుంది. ఇంకా యెంత సేపు ? ఆకలవుతోంది. కొంచెం నిద్ర వొస్తోంది. ....వొచ్చేప్పుడు అమ్మనన్నా పిలవడు. తన యిల్లులాగు తలుపు తోసేసుకుని సరాసరి మంచందగ్గిరికి వొస్తాడు. ఆ పొగరుచూస్తే అనుసూయకి యిష్టం........

నిద్రపోయింది కొంతసేపు. బూడ్సులచప్పుడు గుండెల్లో కొట్టుకుని కళ్ళుతెరిచింది. చప్పున పమిట సర్దుకొని. చీరెని కాళ్ళమీదికి లాగి, గోడవేపు తిరిగి నిద్రపోతున్నట్టు పడుకుంది. "నిద్రే" అన్నాడు. లేప కూడదు. యేంచేస్తాడో. యెట్లా లేపుతాడో చూడాలి, నిమషమయింది. వీపువెనక చప్పుడేలేదు. ఒకనిమషం, రెండు, మూడు-యేంచేస్తున్నాడు ? ఏమైనాడు ? చూడకుండా వూరుకోవడమెట్లా ? మెల్లిగా తిరిగి చెయ్యి కిందనించి వొంటి కన్నుతో చూసింది. మంచంపక్కనే నుంచునివున్న ప్రకాశరావు పక్కున నవ్వాడు. సిగ్గుతో అనుసూయ తల వొంచుకుంది.

"యీ దొంగవేషాలు తెలీకపోతే డాక్టర్లమెట్లా అవుతాం ? నోరు తెరు" గాజుగొట్టం నోట్లో పెడుతో వేలెందుకు బుగ్గకి తగిలించడం ? తన చేతికియ్యకూడదూ ? చెయ్యి జాచింది కూడాను. తనే పెడతాడు ! కిందపడేస్తుందని భయమా ! వూరికే అట్లా నవ్వుతాడేం ? తను అట్లా నిద్రపోతున్నట్లు పడుకోటం యెందుకను కున్నాడో, యేమిటో ! గొట్టం తీసి చూస్తున్నాడు.

"నిజంగానండి మీ బూడ్సుల చప్పుడు వినే లేచాను. నిజం డాక్టరుగారూ."

"లేచి మెల్లగా ఒక్క చూపు చూశావుకదూ, నీకు నిద్ర చెడిపో తుందని ఒక్కరవ్వ చప్పుడు చెయ్యకుండా నుంచుంటే, నీకు నా బూడ్సులచప్పుడు వినపడ్డదా, దొంగపిల్లా" మళ్ళీ బిగ్గరగా నవ్వాడు.

ఆ నవ్వు విని అమ్మ వొచ్చింది. రబ్బరుగొట్టం బైటికి తీశాడు

మళ్ళా. "జరంలేదు. యేంలేదు లేచి తిరగరాదూ ? లేస్తే పనిచెయ్యాల్సి వొస్తుందని భయమో, యేమిటో?" అన్నాడు.

"చాలా అర్భకురాలండీ" అంది అమ్మ.''

"అమిత గారబంచేసి అర్భకురాల్ని చేశారు."

అంత సేపు యేంపింటాడు తన గుండెల్లో ? యెప్పుడూ యేదో వెతుకుతో గొట్టం జరుపుతోనేవున్నాడు. అమ్మా ! అయిందయ్యా !

"మందు బుడ్డేదీ ? ఒకపూట మందుమిగిలిపోయిందే ! సరిగా తాగదు పెంకితనం ! చాలా గారాబం చేస్తున్నారండీ !"

"యేంచెయ్యను, నాయనా ! పదోయేట యీగతి పట్టింది దీనికి. ఈ యేడేళ్లూ కడుపు తరుక్కుపోతోంది. నేను బ్రతికున్న నాలుగు రోజులన్నా గారాబం చెయ్యకపోతే తరవాత యెవరుచేస్తారు ?"

ఎందుకో అమ్మ తనసంగతి తలుచుకున్నప్పుడల్లా అట్లా యేడుస్తుంది ? తన కేదో అవస్త పట్టిందంటుంది. అందరూ అంతే. తన కర్మంట ! తనకేమీ జీవితం కష్టంగా కనపట్టంలేదు. అమ్మా, అత్తయ్యా. మామయ్యా, లక్ష్మి, వెంకన్నా, పిల్లీ తన చుట్టూ-యిన్ని వున్నాయి యింకేం కావాలి ? ........డాక్టరేదో అంటున్నాడు.

"అవునండి. మన సంఘంలో వొచ్చిన అనర్ధమే అది ! మీ అల్లుడు చచ్చిపోవడానికి నిశ్చయించుకోవడమువల్ల, మీ అమ్మాయి బతికివున్నన్నాళ్లూ బాధపడాలి"

ఇతనూ అంటున్నాడు తను బాధపడాలిఅని, యేంబాధ ?

"లేచి తిరుగు. జ్వరంలేదు యేమీలేదు"

అమ్మ ముక్కు తుడుచుకుంటూ వెళ్ళింది.

మళ్ళీ చెయ్యిపట్టుకొని నాడి చూస్తో నుంచున్నాడు.

"చూడు, గాజులు యెంత వొదులైనాయో? మళ్ళీ తొరగా బలవాలి."

"బలవడం యెందుకేమిటి ?"

"ఎందుకేమిటి! ఎప్పుడూ యిట్లానే సన్నంగావుంటే, యెవరికి బావుంటుంది?"

"ఎట్లా బలం పట్టించుకోవడం?"

"బాగా తినడం నవ్వడం?"

"మరి తినడానికి యేమీ పెట్టరుగా!"

"ఏంకావాలి ఆవకాయీ అన్నమూనా?"

"జావలో పచ్చడి నంచుకోనిస్తారా?"

"రేపు అన్నమే పెట్టిస్తాను.........నువ్వు దొంగవేషాలు వెయ్యకుండా వుంటే సరి!"

డాక్టరు వెళ్ళిపోయినాడు, మళ్ళీ రేపు సాయింత్రందాకా కనపడడు తమాషావాడు. ఒకటేవాగుడు, ప్రతివాళ్ళతో చనువే! మునపటి డాక్టరు మహాగొప్పచేసేవాడు. మొహం ధుమధుమలాడుతోవుండేది. ఈ డాక్టరెంత మంచివాడో!

9



# అత్తిల్లు

దొడ్లో బొగ్గుల కుంపటిమీద నీళ్ళుపెట్టి విసురుతో కూచుంది అనుసూయ. పక్కన ఆస్పత్రిలో తొట్లు పాకీవాడు కడుగుతున్నాడు. ఆస్పత్రి యెంత అసహ్యంగా వుంటుందో! ఆ వాసనా, మురికీ, ఆనల్లని బట్టలూ! ఎవళ్ళెవళ్ళో పడుకున్న పరుపులూ,—వాళ్ళ ఖర్మం! కంపు యీ దొడ్డికికూడా కొడుతుంది......పోయినసారి వీళ్ళింటికి వొచ్చినప్పుడు ఆ పక్కన గుడ్డకప్పి పీనిగనికూడా పెట్టారు. ఆ డాక్టరు పీనిగని కోస్తాట్ట! భయంకదూ! అసహ్యంలేదూ? ఇప్పుడు ఆడాక్టరేనో. యింకోడో! అంత మంచి డాక్టరు పీనిగనికోస్తాడా...,......యింకా అత్తగారికి నయంకాదేం? తనకి మళ్ళీ పుట్టింటికి పోవాలనివుంది. ఆ తెనుగు వైద్యుడు యెన్నాళ్ళు మందిస్తే నయమవుతుంది? అమ్మని వొదిలి యీ ముసలివాళ్ళిద్దరితోనూ వుండడం యేమీ బాగుండలేదు. మాటిమాటికీ తనని యెందుకు పిలుచుకొచ్చుకుండారు యిట్లా? తమకొడుకు పోవడానికి తను కారణమని అప్పుడేడ్చారు, ఆ కొడుకు పోయినందుకు. అతని బాల వితంతువు తమకి యావజ్జీవం వీలైనప్పుడల్లా సహాయం చెయ్యాలని గావును వీళ్ళవుద్దేశ్యం! వీళ్ళు పంపమన్నప్పుడల్లా అమ్మ కూడా మాట్లాడకండా తనని పంపుతుంది. యీ ముసలాళ్ళ ఆస్తి తనకి వొస్తుంది అని అమ్మ ఆశ. ఓ చిన్న కుర్రాణ్ణి తనకి పెంపకంచేసి వొదినెగారి పిల్లనిచ్చి పెళ్ళిచేస్తానంది.

ఎవరూ తలుపు కొడుతున్నారు బైట ?

అనుసూయ లేచి వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా డాక్టరు ప్రకాశరావు నుంచున్నాడు.

"నువ్వు !" అన్నాడు.

తలవొంచుకుంది.

"ఆర్నెల్లయిందికాదూ ?........మళ్ళా నీకు యెప్పుడన్నా జబ్బు చేస్తుందేమోనని చూశా-ఎందుకు జబ్బు తెప్పించుకోలా ?"

"ఎందుకొచ్చారిప్పుడిక్కడికి ?"

"ఈ యింటో మహాలక్ష్మమ్మగారిని చూడ్డానికి"

"మా అత్తనా !"

"మీ అత్తేమిటి ! మేనత్తా ?"

"కాదు"

"ఇంకేమిటి ?"

వూరికే యెందుకీ ప్రశ్నలు ? అర్థంకాదూ ?

"అత్తవారు...."

"ఆహా, పద__"

వెళ్ళిపోయేప్పుడు గదిబైట__

"నిన్ను మళ్ళాయెప్పుడు చూస్తానా అని యిన్నినెలలూ అనుకుంటున్నాను. ఎందుకు కనపడలేదూ ?"

"ఎక్కడ ?"

"ఎక్కడన్నాను ! కనపడలేదేం ?"

"ఎందుకు ?"

ఇంక ప్రతిరోజూ ఆయింటో వొంటరిగా కూచుని యేంతోచక డాక్టరుగారిని యెదురుచూడ్డం అలవాటయింది. అప్పుడప్పుడు. బావి దగ్గరికి నీళ్ళకి వెళ్ళినప్పుడల్లా ఆస్పత్రివేపు చూస్తుంది. ఎప్పుడన్నా ఒక ఆస్పత్రి బంగళానించి యింకోబంగళాకి వెడుతో దూరంగా కనిపిస్తాడు. పన్నెండు

ఒంటి గంటదాకా. ఉంటాడు. తమ భోజనాలు అయిందాకా ఆయిన వెళ్ళిన సంగతి ఆస్పత్రి నిశ్శబ్దమే తెలుపుతుంది. మళ్ళీ సాయింత్రం జనంనిండు తారు. ఎప్పుడన్నా ఆస్పత్రిలోంచి తనవంక చూస్తాడేమో ! ఏదన్నా పనిమీద. తమ దొడ్డికీ ఆస్పత్రికీ మధ్యనున్న తీగెల దగ్గరికి వొస్తే! తనని పలకరిస్తే! ఎంత గొప్పగా వుంటుంది తనకి ! అందరూ ఏమను కుంటారు ? తన గొప్ప తనంతెలుస్తుంది. వాళ్ళందరిమీదా అధికారంచేసి బాగా వాళ్ళనికోసి చేదు మందులు పోసేవాడు, ఎంతో సంతోషంతో తనని పలకరించడం ! కాని రాడు. తనని అంత దయగా పలకరించినా, మళ్ళీ అప్పుడే మరిచిపోతాడు. అంత గొప్పపనులలో, తను ఏమూల ! ఇట్లా ఎంతమందిరోగుల్ని పలకరిస్తాడో ! ఎంత మందితో దయగా వుంటాడో !

కాని తోచకండావుండే యీ యింటో ఆ ఆస్పత్రివంకచూడడం కొంత పొద్దు పోతుంది. ఎప్పుడూ గొణుగుతోవుండే ఆ అత్తనించి తప్పించుకోడం, ఆకాళ్ళకురాసే ఆనూనె వాసన ! అబ్బా ! కొంచెం అత్తరు కలపడానికి వొప్పుకుంటాడేమో డాక్టరు ! ఆచీకటిగదిలోంచి ఆవాసననుంచి బైటపడి ఆస్పత్రి చెట్లక్రింద నీడల్ని, పచ్చని గడ్డిని చూడడం ఎంత ఆహ్లాదకరంగావుంటుంది ! ఆగచ్చు వరండాలు కళ్ళకి ఎంతో చల్లగా వుంటాయి. కానిఅంత అందమైనయిళ్ళల్లో ఆబాధ! ఎట్లాభరిస్తాడో డాక్టరు?

ప్రతి మధ్యాన్నం వొస్తాడు డాక్టరు. ఆయన్ని చూస్తే అత్తకేమీ సంతోషంలేదు. ఎందుకో ? తన జబ్బులో యీ డాక్టరు రావడం ఎంత ఆనందంగా వుండేది ! ఈ అత్తవారి యింటో ఆడాక్టర్ని చూస్తే తన పుట్టింటివేపు బంధువుల్ని చూసినట్టే వుంటుంది.

ఒకనాడు డాక్టరు చేతులమీద నీళ్లుపోస్తోంది.

"కోటుమీద పొయ్యకు మరి !....పొద్దున్న దానిమ్మ చెట్టుకింద నుంచుని చూస్తున్నావే ! ఏమిటి ? సిగ్గెందుకు ? నన్నా ! నేనూ....(ఆగి) మరి యీ రాత్రికూడా రావాలి....ఎంత బావున్నావు ఆ చెట్టుకింద! పిచ్చి పిల్లా ! ఎందుకు అట్లాచూస్తావు ! నీకేం తోస్తుంది యీ యింటో! పాపం

....రాత్రి ఎనిమిదింటికి వొస్తాను—ఒకడు చచ్చేటట్టున్నాడు అందుకని —అప్పుడొక మాటు కనబడవూ! ఆ చెట్టుకిందకాదు—చీకటి. తీగెల దగ్గిరికి రా....సబ్బు మంచివాసన వేస్తోందే! ఎక్కడకొన్నావు?........ దొడ్లో తీగెలదగ్గిరికిరా........యెనిమిదింటికి........ నీళ్ళు ........తమాషాకి ఒకమాట మాట్లాడు........యేంతోచదు........వొస్తావుకదూ....... చాలు....తువ్వాల."

అనసూయ యేమీ అనలేదు. రాత్రి ఎనిమిదింటిదాకా ఆసంగతి యెక్కువ ఆలోచించనేలేదు, ఎనిమ్మిందింటికి యెట్లా వొస్తా ననుకున్నాడు? భోజనాల సమయం. తను వొడ్డించక్కర్లేదూ? వంటకేగా తనని పిలుచుకుంది వీళ్ళు!

వొడ్డిస్తోఆలోచిస్తేనేవుంది: ఎనిమిది దాటింది. తీగెలకేసి చూస్తాడు ఎట్లా వొస్తుందనుకున్నాడు? అంతమాత్రం తెలీదూ! ఎందుకు రమ్మన్నాడో! అతనికీ తనమల్లేనే యేంతోచదు గావును! ఆ చీకటి ఆస్పత్రిలో భయమేమో! రాత్రి యెవరికి మందు లివ్వాలి? పాపం! ఈడాక్టర్లకి యెంతకష్టం..........ఇంకా వుంటాడా? తను కనపడకపోతే అతనికి లక్ష్యమా? అయినా వున్నాడేమో!

మజ్జిగ పోసేసి, దొడ్డి గుమ్మంవగ్గిర్నించి ఒక్కపరుగు తీసింది. రాత్రి గాలిలో పరిగెత్తడం యెంతో బాగుంది! చిన్నతనంలో భయమేసి యింటోకి పరిగెత్తడం జ్ఞాపకమొచ్చింది. తీగెలవగ్గర పచారుచేస్తున్నాడు. ఆ పొడుగాటి గొట్టాలవంటి కాళ్ళతో, వుంగ్రాలు నుదురుమీదపడి మెరిసే జుట్టుతో.

"ఇంతసేపటికా రావడం?"

"మరిభోజనాలు కానక్కర్లా....సరే చెప్పండి."

"ఏమిటి చెప్పడం?"

"మరి యెందుకురమ్మన్నారు?"

"వూరికే యిట్లా నుంచోడానికే"

"మరి నేను వెళ్ళాలి, వాళ్ళు లేచేటప్పటికి."

"మళ్ళీ యెప్పుడొస్తావు?"

"ఇంకరాను. అత్తకి కాళ్ళుపిసకాలి, అక్కడే నిద్రవొచ్చేస్తుంది."

"వెళ్ళిపోతావా? అప్పుడే! నీమొహమన్నా కనపట్టంలేదు ఆ నీడలో యిట్లారా మరి.........వూరికే ఒక్క నిమిషం అట్లానుంచో చాలు. వీళ్ళ యింటో నీకు సంతోషంగా వుందా?

"లేదు. అమ్మదగ్గిరికి వెళ్ళాలనివుంది."

"అక్కడ నీకు బాగుంటుందీ"

"ఆ—"

"వొంటరిగావుండదూ? నీమీద ఎవరు ప్రేమ చూపుతారు ముందేంచేస్తావు?"

"ఏంచేస్తా—?"

"మీ అమ్మ చచ్చిపోతే........"

"ఎందుకిదంతా? వెడుతున్నా."

"అప్పుడే!"

"వాళ్లు పిలుస్తారు."

"చెయ్యి యిట్లా జాచు. సన్నగా వేళ్ళతో కొనతేరి నీచెయ్యి.... యెంత బాగుంటుందో తెలుసా?"

"అందుకనేనా. అంతసేపు నాడిచూసేవారు?"

నవ్వి బుగ్గమీద కొట్టాడు.

అనసూయ చెయ్యి పట్టుకొని తీగెలదగ్గిరికి లాగి బుజంమీద చెయ్యి వెయ్యబోయినాడు. అనసూయ పరిగెత్తుకుని వెళ్ళింది.

రాత్రి పడుకోబోయేముందు. పక్కన దీపం పెట్టుకుని అద్దంలో తన మొహం చూసుకుంది. చీకట్లో తన సన్నని పెదిమలు అతనికి కనపడ్డాయేమో? ఎందుకో తనమీద యిష్టం! చేతినీ, వేళ్ళనీ, నిదానించి చూసుకుంది. అక్కడ పట్టుకున్నాడు, కొంచెంనలిగినట్టు యెర్రగా,

యింకా కనబడుతోంది అనుకుంది. పనివల్ల గోళ్లు అరిగిపోయినాయి. వాళ్ళ సుందరమ్మ గోళ్ళమల్లె యెర్రగా, గుండ్రింగా, చంద్రవంకలవలె వుంటే అతనికి యింకా యెంత బావుండేవో! అతనికి బాగుండడం యెందుకు? అని అనుకునేప్పటికి మెరుపువలె వెన్నెముకవెంట సంతోషం యెక్కింది. ఆ ప్రశ్నే అడుక్కుంటో పడుకుంది. దానికి ప్రత్యుత్తరం మొగ్గల్లో పరిమళంవలె దాగివుంది. యెంత వెతికినా కన పళ్ళేదు ఆ రాత్రి.

అత్తకి జబ్బు నయమయింది. కాని స్నేహంవల్లగావును డాక్టరు మామగారిని చూడడానికి వొస్తూనేవున్నాడు, తీరికైనప్పుడల్లా రోజూ రెండుమూడుసార్లు. ఇంకా అనుసూయ తల్లిగారింటికి వెళ్ళలేదు. ఒక రోజు మధ్యాహ్నం ప్రకాశరావు లోపలికి రావడానికి అనుసూయ తలుపు తీసింది.

"ముసలివారేరీ"

"ఒకరు నిద్రపోతున్నారు, యింకొకరు వంటింటో కాఫీగింజలు వేయిస్తూన్నారు."

"మూడోవారు తలుపుతీశారు."

"మామగారిని లేపనా?"

"వొద్దు మళ్ళీవస్తా. వొచ్చినకార్యం గుమ్మందగ్గరే తటస్తపడ్డది ........యెంత బాగున్నావో యిప్పుడు! తలంటి పోసుకున్నావుకదూ? పొద్దున్న చూశాను నువ్వుచేసే ప్రయత్నమంతా. యిట్లా మొహం పక్కకి తిప్పి నుంచో. బాగా చూడనీ. ఒక్కసారి ముద్దు పెట్టుకోవొద్దూ మరి?"

దగ్గరగావొచ్చి నడుంమీద ఒక చెయ్యివేసి. యింకా దగ్గరగా లాక్కుని చంపమీద గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు. వొదిలెయ్యగానే అనుసూయ పెద్దసిగ్గుతో లోపలికి వెళ్ళింది. అతను వెళ్ళినచప్పుడు విన పడగానే. అద్దం ముందునుంచుని పది నిమిషాలు తనవంక తనే చూచు కుని, జుట్టు అయిదారువిధాల మొహంమీదికీ, పైకీ పాపిడితీసి చూసు

కుంది. కళ్ళకికాటికే పెట్టుకోనిస్తే, యింకా యెంత బాగా కనపడేదాన్నో అనుకుంది. ముడివేసుకున్నా, పూలు పెట్టుకోనీరు. చేత్తోగులాబిపువ్వు పట్టుకుంటేనే అత్త కోప్పడ్డది. వాళ్ళ జానికి మరువం తలలో పెట్టుకుని నడుస్తోవుంటే ఎంత మంచివాసన వొస్తుంది! చామంతి పూలు, పచ్చగా నల్లని జుట్టుమీద ఎట్లా మెరుస్తాయి జానికి తలలో.

ఇంక ఆవాళ యేంతోచలేదు. కొంతసేపటికి పూర్తిగా అర్థంకాని భయమేదో తట్టింది. ఇంకావీళ్ళు తనని అమ్మదగ్గిరికి పంపరేం? అమ్మనాన్న కబురు పంపరేం? కొడుకు చచ్చినా కోడలుమీద ప్రేమ పోనివాళ్ళు వీళ్ళుమాత్రం కనపడుతున్నారు లోకంలో—

రెండురోజుల తరవాత మధ్యాన్నమప్పుడు, ముసలమ్మ, అనుసూయని చూసి—

"ఏమే, మరీ వొస్తోంది. జుట్టు అట్టా పైకి దువ్వావేం?

"దువ్వితేనేం? ఏం దువ్వాను"

"ఏమీ ఈ ఈ వేషాలు మరీని!"

"ఏం వేషాలు అందరూ యిట్లానే దువ్వుతున్నారు"

"అందరూ ఎవరూ?"

"మరీ పోకిళ్ళు పోతున్నావు! కిరస్తాని పంతులమ్మవా?"

"మనవాళ్ళే దువ్వుకుంటున్నారు. సోమంచి వాళ్ళ అమ్మాయి జుట్టుచూడండి"

"దానికేం! దాని మొగుడు నేర్పుతున్నాడు. అవన్నీ దానియిష్టం— దాని మొగుడి యిష్టం.

ఏం! మీఅమ్మ నడుగుతాగా! యెవరన్నాచూస్తే యేమను కుంటారు? యిన్నాళ్ళు నీకు జుట్టు అట్టిపెట్టినందుకే అనేక మాటలంటు న్నారు. మంచిదానివే! మాపరువు బాగా నిలపెడతావు? యెవరి కోడలంటే నవ్వులచేటు. ఛీ! ఛీ!"

అనుసూయకి యేడుపొచ్చింది.

"అమ్మ యేమీఅనదు. నేనిక్కడవుండను. అమ్మదగ్గరికి వెడతా"

"ఎన్నాళ్ళని వుంటావు అమ్మదగ్గిర? రేపేదో పెంపకం కాగానే యింకెక్కడవుంటావు, యిక్కడకాక! వెడుదుగానిలే యెల్లుండి తద్దినం కాగానే."

పక్రికాశరావు వొచ్చాడు.

"ఏమిటి తగూలాడుతున్నారు?"

"ఏం లేదులెండి."

అనుసూయ లోపలికి వెళ్ళింది.

"ఈ కాలపు పిల్లలకి మరీ మతిపోతోంది. అప్పన్న మందమతు లన్నీ వీళ్ళకే పుడుతున్నాయి. ఆ మొగుళ్ళ ఆడించడం కోతుల్లాగ వీళ్ళాడడం. మొగాడు యెన్నిపోకిళ్ళన్నా పోతాడు. కాని ఆడదానికి బుద్ధివుండాలి. అయినా మొగుళ్ళున్నవాళ్ళసంగతివేరు. దీనికి వేషాలేమిటి చెప్పండి."

"ఎవరికి?"

"ఇంకెవరికి. మాకోడలుమాటచెబుతున్నాను. దీనికి ఎవరున్నారు? ఎవరి కోసం ఆషోకంతా? మహాకాళి, ఉన్నవొక్కణ్ణీ మాపుత్రాణ్ణి పొట్టన పెట్టుకుంది. ఆనాడే అన్నాను వెంట్రుకలు తీయించమని, కాని ఆతల్లియేడ్చి పట్టుపట్టింది. ఆవంశమే అట్లాంటిదిలెండి. దీని మేనత్త సంగతి తెలుసుకదూ? అది పోనీలెండి మరి యిది మా కోడలై చచ్చిందిగా! దీని బుద్ధులు చూడండి నలుగురూచూస్తే యేమనుకుంటారు.?"

"ఏం చేసింది?"

"మొన్నటినించీ యేంపట్టిందో తెలీదు. ఆగోళ్ళన్నీ కత్తితో గీసింది. ఆతలచూశారా యట్లాదువ్విందో! యెవరికోసమండీ ఆషోకంతా యిదివరకు యిట్లాంటివేమీ లేవు."

"పాపం చిన్నది. పెద్దవారు మీరు అట్లాంటివన్నీ లెక్కలోకి తీసుకుంటారా?"

"చిన్నదేమిటి ? పదహారేళ్ళొచ్చాయి. వాడేవుంటే ముగ్గురుపిల్లల తల్లికావలసింది. ఎట్లానూ రేపు కార్తీకమాసంలో జుట్టు తీసేయిస్తూనే వున్నాములెండి. ఈలోపలదీనికేం పుట్టిందో !"

"ఏం తీసేయిస్తారు ?"

"వెంట్రుకలు తీయించమూ మరి !"

ప్రతివతలారా,పాపం అనుసూయమీద కోప్పడకండి. తక్కిన స్త్రీలకన్న ఏమీ దుర్మార్గురాలు కాదు అనుసూయ. ఆ వయసులో ఎట్లా తక్కిన అవయవలక్షణాలు కలుగుతాయో యీ ఆలోచనకూడా అంత సహజంగానే కలుగుతాయి. తడిభూమిని బద్దలుచేసుకుని తలయెత్తే మొక్కనిచూస్తే, లోకంచుట్టూ చూసి ఆనందపడుతున్నట్టు తోచదూ ? యీ యెండనీ, గడ్డినీ, మంచునీ, చూసి! అట్లానే అనుసూయ కొత్త రొమ్ములు ! యీకొత్త ఆలోచనలు యీలోకపు సౌందర్యాన్ని, పువ్వుల్ని, పురుషుల దృఢవక్షాల్ని, మందమారుతాల్ని చూసి ఆనందిస్తున్నాయి.

పవిత్రవంతులై, మీ ధర్మ భర్తలవల్ల, సంతానాన్ని పొంది, సుఖంగా, కీర్తిలో, సంసారాలుచేసే మీరు, పాపం, అనుసూయనుచూసి, కఠినత్వం దాల్చకండి. మీరు పదహారేళ్ళ వయసులోవున్న రోజులు తలుచుకోండి. మీ కొత్త అవయవాలు, మీ కొత్తఆశలూ, యింత విజృంభించివుండవు. ఎందుకంటే వాటిని నలిపి ఎదగకుండా, గర్వించకుండా, అణగకొట్టేందుకు నాధులు సిద్ధంగా వున్నారుగనక. పాపం, అనుసూయకు ఆ దురదృష్టంలేదు. క్షమించండి ఆపిల్లని పాపం !

18

# పుట్టిల్లు

అనుసూయ బైట అరుగుమీద కూచునివుంది. మునిసిపల్ చాకలాడు దీపాలు ఒక్కొక్కటే వెలిగించుకుంటో వొస్తున్నాడు. కూలివాళ్ళు గుంపుగా పాటపాడుతో యింటికి వెడుతున్నారు. ఎదురుగా సాయేబు గంటవాయించి బొంబాయి మిఠాయి అమ్ముతున్నాడు. కుడుతో కనబడక వేలులో సూదిగుచ్చుకున్న అనుసూయ కుట్టేరవికని వొళ్ళోపెట్టుకుని రోడ్డువంక చూస్తోకూచుంది. ఎదురుగావొచ్చేది డాక్టరు ప్రకాశరావా? ఆ పొడుగూ, ఆ నడకా అట్లానేవుంది. ఐతే పంచకడతాడా? ఆటోపీ యెన్నడూ అతని నెత్తిమీద చూడలేదే? ఇందాక ఇటు వెళ్ళాడు. మళ్ళీ యిప్పుడు తిరిగి వొస్తున్నాడు. ఇటే వొస్తాడుగావును! ఒక్కనిముషం ఆలోచిస్తున్నాడు. అతనే! అవుగో ఆచిన్న పొట్టిమీసాలు! వొస్తున్నాడు. ఎందుకా దడదడనీకు!— కనపరచకు—యింటోకి వెడుతున్నట్టుండు—దగ్గరికి వొచ్చాడు. "అనుసూయా!" అని దగ్గరికి వొచ్చాడు. 'తొమ్మిదింటిదాకా ఉత్తరవేపు లాంతరుదగ్గిర వుంటా— ఒక్కసారి యీలోపున ఆటురా!' అని వెళ్ళిపోయినాడు.

తీగెలదగ్గిర మాట్టాడిన నాటినించి మళ్ళీ కనపళ్ళేదు. ఈడాక్టరికి మళ్ళీ తనజోలిమెందుకు? అమ్మదగ్గిరికి వొచ్చిం తరువాత కొన్నాళ్ళు చూసింది అతను వొస్తాడేమోనని! అతను రాకపోవడం మనసుని బాధపెట్టింది, కాని తొరలోనే మరిచిపోయింది. ఇప్పుడెందుకు? రోడ్డు

మీదమాట్లాడాలా ? కాని అలాంతరు వెనకంతా చీకటే. ఎవరూ వుండరు అతనికెట్లా తెలుసో! వెళ్ళడంమంచిదేనా ? ఎందుకు వెళ్ళాలి ? వెళ్ళాలనిపిస్తోంది. కారణం తెలీకండానే. అతని కంఠం ఒక్కసారి వినాలి తనకి యిప్పుడు బాగా బలంపట్టింది. చాలా బావున్నానని అతను అంటే?

అందరికంటే తొరగా భోజనంచేసింది. మజ్జిగన్నా వేసుకోలేదు. చప్పున రెవిక మార్చుకుని, చప్పుడుకాకుండా గడియ తీసి రోడ్డుమీదికి వెళ్ళింది. దీపాలక్కి అవతలగా తలవొంచుకొని తొరగా నడిచింది. దీపంకింద యెవరూలేరు. వొళ్ళుమండింది. తొమ్మిది దాటలేదుకద ? ఆ మామయ్య యెంతకీ భోజనానికి లేవాడుకాదు. నిరాశతో చప్పున వెనక్కితిరిగింది.

"అనుసూయా !"

సందు మొదట్లో నుంచున్నట్టున్నాడు. దొంగ. వెళ్ళలేదు! ఇట్లా వొచ్చేస్తే ఏమనుకుంటాడు ? ఒక్క ముహూర్తం ఆగింది. కాని ఇంత దూరంవొచ్చి–అనుకునేదేమిటో యిదివరకే అనుకున్నాడు.

"ఎందుకు ? త్వరగాచెప్పండి"

"ఈసందులోకి రా, యెవరూలేరు."

"రాను. చెప్పండి వెడతాను"

"ఇక్కడెట్లా ? రోడ్డుమీద మనుష్యులు నడుస్తోవుంటారు అట్లా రా వొక్కనిమిషం."

చీకట్లో వెళ్ళడం భయం. కాని డాక్టరున్నాడుగా! ఆవెనుక గడ్డివాము, దానిపక్కన మామిడిచెట్టువుంది, తలుపుతోసిలోపలికి తీసికెళ్ళాడు చెట్టునీడకింద నుంచుని అనుసూయ మెడచుట్టూ చేతులు వేశాడు. అతని గుండెలు ఆయాసంతో వలే కొట్టుకోడం అతనిచేతులు వొణకడం, అనుసూయకి తెలిసి భయంవేసింది. ఆమె బుజాలమీద చేతులతోపట్టుకున్నాడు.

"అనుసూయా. నువ్వులేకుండా నాకు చాలా కష్టంగావుంది. ఎప్పుడూ నువ్వే జ్ఞాపకమొస్తున్నావు. ఎన్నిసార్లో నిన్ను చూడాలని

మీయింటివేపే నడచాను. నా మీద దయలేమా ? చెప్పు యిట్లాచూడు.''

అనుసూయ మొహాన్నియెత్తి ముద్దు పెట్టుకున్నాడు. ఎంతబావుంది ఇట్లాంటిసుఖమొకటి లోకంలో వుందని అనుసూయకి తెలీదు. భార్యాభర్తలు యథావిధిగా పిల్లలకోసం ఎదో చేస్తారనుకుందిగాని యీ నరాలు కాల్చే అనుభవం ఆమె అనుభవంలోలేదు.

''నిన్నుచూస్తే నాకెంతయిష్టమని ! యిట్లారా నన్ను ముద్దు పెట్టుకో, రా'' గట్టిగా అదిమేస్తున్నాడు. ఎంతబలమో ! యెంతబావుంది అంత దగ్గరగా నుంచోడం ! యెంతబావుంది !

''ఎంతబావున్నావు, అనుసూయా ! నీకళ్ళు యెంతఅందంగా చూస్తున్నాయో ! దగ్గిరగా రా, ఎందుకాభయం ? సిగ్గా ! నేనేగా ! ఇంక నిన్ను వొదలను. ఎన్నడూ యిట్లా పట్టుకుంటాను. ఎప్పుడూ, యిక్కడే, తెల్లారినాసరే. వెళ్ళకు. యింకోసారి—''

అబ్బా! యేమిటీ ఆనందం ! పరిగెత్తుతోంది. వొళ్ళంతా దూకుతో ఎంతబావున్నాయి ఆమాటలు ! తనకోసమే ! తనెందుకు అతనికి? ఎప్పుడూ ఆమాటలు వింటో, అట్లా చేతుల్లో అంత దగ్గరగా అనుకుని వుండడం ఎంతబావుంటుంది ! ఇంకా పైకి లాక్కుంటున్నాడు. యేమిటి ఆచేతుల్తో చేస్తున్నాడు? అబ్బా వొద్దు! ఏమిటిది ? ఛా! ఛా!—భయం సిగ్గు వొద్దు వొద్దు-తప్పు-లోబడిపోకు—పాపం—అమ్మ వాళ్ళకి తెలిస్తే—ఇట్లా చేస్తాడనుకోలేదు—వొదిలించుకుని దూరంగా నుంచుంది. వొచ్చి మళ్ళీ పట్టుకున్నాడు.

"రా, యెందుకు వెళ్ళిపోతావు ? నేనేగా ! రెండు నిమిషాలు—యిప్పుడే వెళ్ళిపోదుగాని."

మళ్ళీ బలవంతంగా లాక్కుపోయినాడు. లోబడకూడదు. ఏదో తెలీని అద్భుతమైన ఆశ, వొణుకు, ఆత్రుత, బాధ, లొంగిపొమ్మని అరుస్తున్నాయి.

''చూడు. ఆవిచిత్రం—ఆ అసమాన్యానుభవం రుచిచూడు''

అంటున్నాయి.

"వొద్దు, వొద్దు తప్పించుకో, పాపం, నీచం, భయంకరం, నీకింకా తెలీదు దీని పర్యవసానము" అని సంఘనిబంధనలు, నీతి నిబంధనలు, స్త్రీ సహజముగ్ధత్వము, లజ్జ, భయము అరుస్తున్నాయి.

"నన్నట్లా తాకకండి. ఇంకెప్పుడూ రాను. వెళ్ళండి." విచిత్ర మైన కఠినత్వం వొచ్చింది కంఠంలోకి. కొత్తబలంవొచ్చింది చేతుల్లోకి. తోసేసింది-తన్నుకుంది. అతను అదుముతున్నాడు.

"లొంగిపోతున్నావు. పోట్లాడు"

"మోహమూ ప్రేమా మాయమైనాయి"

"వీడా నన్ను బలవంతంచేసి, నీచంగా లోబరుచుకునేది!"

"పోట్లాడింది."

"అరుస్తా, హొదులు ముందు. గాడిదా" తప్పించుకుంది. జుట్టు వూడింది. మొహం నలిగింది, చంపలమీదా వొంటిమీద రక్కులు మెల్లిగా తుడుచుకుంటో, కుచ్చెళ్ళెత్తిపట్టుకుని, జుట్టు వొళ్ళంతా పడుతో పరిగెత్తింది. ఆరూపం చూసేప్పటికి ప్రకాశరావుకి కళ్ళుతిరిగి రక్తం చిందులాడింది. ఇట్లాకాదు ఎప్పుడూ తనకి, కావలసినప్పుడల్లా నెమ్మదిగా శాంతంగా, అందమంతా, అనుభవించేందుకు వీలుగాదొరకాలి. తొరగా వెళ్ళి లాంతరు అవతల అనసూయని కలుసుకున్నాడు.

"ఏంచెయ్యను. రేపు వొక్కసారి రా"

"ఈసారి నన్ను రమ్మంటే అమ్మతో చెప్పుతాను వెళ్లు; పో."

అతని మొహంవంక కంటిచివరినించి చూసి మొహం తిప్పేసు కుంది. ఆవొక్కచూపులో ఆమె మొహంలోకి జాలి వొచ్చింది. ఆగి-

"మరి నన్నెందుకట్లా చేశారు? తప్పుకదూ? వెళ్ళండి నేను మాత్రం రాను."

"నామీద కోపమేనా?"

"కోపంకాదు, యేంకాదు."

అనుసూయ యెవరన్నా తనని చూస్తారేమోనని భయంవేసి, వెంటనే పడుకుంది. ఆసంగతే జ్ఞాపకమొస్తోంది. ఆ సంతోషమూ, ఆభయమూ, ఆముద్దూ ఆ అసహ్యమూ, అన్నీ మళ్ళీతోచాయి. ఒక్కొక్కప్పుడు ఆతను మృదువుగా తాకిన శరీరాన్ని తలుచు కున్నప్పుడు, మళ్ళీ దాన్ని ముద్దు పెట్టుకోవాలనిపించింది. కాని ఆగోళ్లు గుచ్చిన స్థలాలు— నోటితో, వేళ్ళతో గట్టిగా పట్టుకోడం యెంగిలి తలుచుకుంటే, అప్పుడు లేచి తలంటిపోసుకోవా లనిపించింది.

మొండివాడు మర్నాడు సాయింత్రం ఒక చీటీ పడేసి వెళ్ళాడు. దాంటో మళ్ళీ రమ్మన్నాడు. పైగా—

"నీజుట్టు తీసేయించాలని చూస్తోవుంటారు, బహుశా. నువ్వు నాదగ్గిరికి వొస్తేవొచ్చావు, రాకపోతే పోయినావు. దానికిమాత్రం వొప్పుకోకు. అది చాలాఅసహ్యం. నీకే సహాయమైనా చేస్తాను.''

తనువెళ్ళ తలుచుకోలేదు. పాపం, అంత గొప్పవాడు, అందరూ గౌరవించేవాడు, తనని అంతగా కావలసి పిలిస్తే, తను తిట్టినా, కోపం తెచ్చుకోక, తనను మళ్ళీకోరి, తన జుట్టుమీద అంత శ్రద్ధ తీసుకుంటున్నాడు. దీపంవెలుగులో యెంత తెల్లబోయి, సిగ్గుపడి, కనపడ్డదో అతని మొహం! ఒకసారి వెళ్ళిచూస్తే! కాని మళ్ళీ అట్లా మొదలు పెడితే! యెవరన్నా చూస్తే వెళ్ళకూడదు.

ఇదివరకు తలవెంట్రుకలు తీస్తారంటే ఆసంగతి విచారమే కలిగించలేదు. మామూలుగా జరగడం లాగుంది. కాని యిప్పుడు భయం పట్టుకుంది. తనకిష్టంలేదని తక్కినవాళ్ళకి తెలియచెయ్యాలి. ఎట్లా? ఆసంగతి యెత్తినప్పుడల్లా, మొఖం మాడ్చడం, తనకు పట్టినట్టు తిరగడం చెయ్యాలనుకుంది. అసలు అనుసూయకి తన నిగనిగలాడే జుట్టునిచూస్తే చాలాయిష్టం. ఆప్రేమంతా మనసులోంచి యిప్పుడు పైకితోచింది. ప్రకాశరావుని మాటలని నొప్పించింది. దానికి పరిహారంగా యిప్పుడతను చెప్పినట్లు జుట్టుని కాపాడుకోవాలి. ఈసారి అతను చూసినప్పుడు అందంగా

కనపడవొద్దూ! తనని యిదివరకటివలెనే వున్నదని చూడవొస్తే తను అమ్మలాగు బోడిగుండేసుకుని ముసుగుతో.........ఛీ.........ఏమైనా సరే వొప్పుకోకూడదు. గడ్డివాముకి ఆనుకుని తన జుట్టులో అతనువేళ్ళని దూర్చి....ఏమైనాసరే వొప్పుకోకూడదు. తన కిష్టంలేదని చెప్పేసింది స్పష్టంగా ఒకసారి.

వెళ్ళలేదు. కొన్నినెలలదాకా అతనివేపు చూడలేదు, అతనెంత తిరిగినా ఎన్నిచీట్లు వ్రాసినా.

* * *

తల్లీ, మేనమామా, అనుసూయబాధతో సానుభూతిని చూపారు. కాని మామ భార్యవొప్పుకోలేదు. తలవెంట్రుకల విధవ తన యింటో వుండకూడదంది. తక్కిన బంధువులు వాళ్ళకి తలవొంపులనీ, అటువంటి ఆనుమాయతి తమఇంటో లేవనీ అన్నారు. ముఖ్యం అత్తవారు వొప్పుకోలేదు. చచ్చి పోయిన తమకొడుకు ఆత్మ భార్య గుండునిచూసి కాని పరలోకాలకి పోదనుకున్నారు. బంధువులలో ఆందోళన ప్రారంభించింది. 'డిస్టర్బు' అయిన చెట్లమీది తేనెటీగల్లాగు ధ్వనిచేస్తున్నారు. బలవంతంగానన్నా లాక్కెడతామన్నారు. అనుసూయకి భయంపట్టుకుంది. ప్రకాశరావు సహాయం అడిగితే-యేచేంస్తాడు? కాని అడగకూడదని, అడిగితే అతని చేతుల్లో చిక్కినదాననౌతానని, అంతరాత్మ పలికింది.

# అత్తిల్లు

చేతులో చీటీ పట్టుకుని సాయింత్రం అనుసూయ ఆలోచిస్తో నుంచుంది. ఆమె కళ్ళల్లోని దూర దృష్టినిచూసే ప్రియుడే పక్కనవుంటే పరవశుడై వుండును. ఆమెలోని వుత్సాహం, హృదయ నిర్మలత్వమూ, ప్రజ్వలించే యవ్వనోద్రేకమూ, ఆమెకి లేని అందాన్నికూడా తాత్కాలికంగా కల్పించాయి. పిరుదుల దగ్గిర్నించి మెడదాకా మంచి వొంపులు తిరిగి కళ్ళని అక్కడే సంచరించేట్టు చేస్తుంది. ఏకవులూ వర్ణించలేని, ఏ మాటలూ వ్యక్తపరపలేని, సాధారణంగా స్త్రీలకి వుండని, Charm, గ్రేస్, వున్నాయి ఆమెలో. ఏఅవయవంలో, ఏరంగులో వుందో, ఆ ఆకర్షణ నిర్ణయించలేరు.

ఈ రాత్రి మళ్ళీతనని తొమ్మిదింటికి రమ్మంటాడు ప్రకాశరావు. వెళ్ళాలా, వొద్దా ? తన పట్టుదలకిలొంగి యీ సంవత్సరం, వూరుకున్న వాళ్ళు గట్టిపట్టుపట్టారు యీసారి. ఈ పెంపకమైన కొత్తకుర్రాడికి విష జ్వరం వొచ్చినప్పుడు తన తలవెంట్రుకలే ఆజబ్బుకి కారణమని అందరూ నమ్మారు. ఇంతా డాక్టరు ప్రకాశరావు కుదిరిస్తే, తన వెంట్రుకలు తీయిస్తామనే మొక్కుబడే వాడిని కుదిర్చిందని వాళ్ళ నమ్మకం, వొదిలేట్టులేరు. అమ్మకూడా తనవేపులేదు యీసారి. అత్త కొట్టడానికి సిద్దమయింది. మరీ నీచంగా చూస్తున్నారు. ప్రకాశరావునుచూసి అనుమానపడుతున్నారు. ఆయన్ని రమ్మని యి దివరకు వ లె పిలవడం

మానారు. తనమీన యేవో కుట్రలు జరుగుతున్నాయి. సీతారామయ్య మామయ్య తనవేపే కాని, ఆనాటిరాత్రి అతడు నిద్దట్లోచేసిన ఆ పాడుపని తెలిసినప్పటినించి అతనితో సరిగా మాట్లాడడం మానేసింది తను, యింక తనకి డాక్టరు ప్రకాశరావునే సహాయం అడక్క తప్పిందికాదు. తనువ్రాసి చేతిలో తటాలునపెట్టిన చీటీకి బదులు యీ చీటీ తీకొనుచ్చి యిచ్చాడు. రాత్రి తీగెలదగ్గిరికివొస్తే ఆలోచించవొచ్చుట. వెళ్ళి చూడాలి. వెడితేనేం?

అందరూ పడుకున్న తరవాత దొడ్డితలుపు తీసుకువెళ్ళింది.

"నేను తిట్టినందుకు కోపం పోయిందండీ?"

"నా కెందుకు కోపం! నువ్వూ మరిచిపోవలసింది. చాలా దుర్మార్గమైనపని చేశాను. నాకు వొళ్ళు తెలీలేదు."

"అదిపోనీండి. యిప్పుడు యేం చెయ్యమంటారో చెప్పండీ."

"ఒక్కనిమిషంలో యేంచెప్పను? వుండు—అంతాచెప్పు"

"నేను తొరగా వెళ్ళాలి. యెవరన్నా చూస్తారు యేముంది చెప్పడానికి?"

"నీజుట్టు తీసేస్తారంటే, నీకంటే నాకు విచారంగావుంది. యిట్లా చూడు. తళతళలాడే యీ చక్కని జుట్టునంతా తీసేస్తే మళ్ళీ నిన్నెట్లా చూడను?"

"చూడకండి"

"చూడకండా బతకగలనా? యిట్లా చూడు. నామాటలు అబద్ధంగా కనపడుతున్నాయా? యింకా నమ్మకంలేదూ?"

"సరేలెండి. కాని నాకు యేం సహాయం చేస్తారో చెప్పండి."

"చెప్పడమెందుకు? పక్కన నేనుండి అట్లాంటి పనిజరగనిస్తానా?"

"ఏం చేస్తారేం?"

"రెక్కలగుర్రంమీద యెక్కుకుపోతాను. చైనాదేశం వెళ్ళిపోదాం. బాణాలతో యుద్ధం చేస్తాను. అందరూ పారిపోతారు, నీకేం భయం లేదు, నాధైర్యం నిలపడానికిమాత్రం రోజూ ఒకసారి యిట్లా కనపడు

తోవుండు."

"రోజూనా ! రాను. వాళ్లు కనుక్కోరూ ?"

ఇక్కడేవుంటే చూస్తారు, అట్లా ఆస్పత్రిలోకి వెళ్ళిపోతే యెవరూ కనుక్కోరు. నీకేంతోస్తుంది ? యేం సరదాగావుంది ఆయింటో ?"

"అక్కడికి రానండీ. కాని నన్ను కాపాడేభారం మీది. వెడుతున్నాను."

"అప్పుడే వెడతావా ?"

"మళ్ళీ రేపు వొస్తాలెండి యిక్కడికి."

పాపం—ఇంకా తెలీదు అనుసూయకి స్వలాభంలేకండా జరిగే సహాయం లోకంలో ఎంత అరుదో—ముఖ్యం పురుషులనించి స్త్రీలకి.

* * *

ప్రకాశరావుని కలుసుకోవడం చాలా గట్టి అలవాటుగా పరిణమించింది. అతన్ని చూడకుండా, మాట్లాడకుండావుండలేదు. సంతోషమేమీ లేని ఆమెజీవనానికి అమృతంతాగిస్తున్న వాడివలె వున్నాడు ప్రకాశరావు. సరిగా ఆమెహృదయం యవ్వనంలో పురుషునికోసం తెరుచుకున్న సమయంలో ప్రకాశరావు ఆమెని సమీపించాడు. ఆసమయంలో యెవరు ఆస్థానంలోవున్నా వారే ఆహృదయంలో అతుక్కునేవారు. అట్లానే సాధారణంగా భర్తలంచరూ భార్యల హృదయాల్ని వశపరచుకునేది ! భర్త లేని అనుసూయకు, భర్తస్థానంలో ప్రకాశరావు నుంచున్నాడు. ఆమెభక్తి, ప్రేమ, సేవ, అన్నీ అతనికి స్వభావసిద్ధంగా అవే అర్పించుకున్నాయి. కనకనే హృదయానికి యెంతో అలవాటైనట్టు సమీపబంధువైనట్టు తల్లికన్న, బంధువులకన్న, తనకన్న, తన నీతికన్న, పేరుకన్న యెక్కువైనాడు. నిజమైన భర్తగా, శాస్త్రాల్లోచెప్పినట్టు, నిజమైన దైవమైనాడు, ఆమెకి. మొదటి హృదయబంధం వొదుల్చుకోడం కష్టం.

పెరుగుతున్న తీగె యెట్లా ఆధారంకోసం వెతుకుతుందో నవ యవ్వనంలోవున్న కన్యహృదయం, ప్రేమకోసం అట్లానే వెతుకుతుంది. అది సృష్టిలోనే ఏర్పడ్డది. మనుషుల మనసుల ఆధీనంలోలేదు. వాన భూమిమీదపడకుండా ఆపడం ఎంతసులభమో. స్త్రీహృదయంలోంచి పేర్మను అడ్డపెట్టడం అంతే సులభం. భర్తవుంటే, ఆయన్ని ఎంత ప్రేమించి, ఎంత త్యాగంచేస్తే స్త్రీని అంత మెచ్చుకుంటారు. పేర్మా, త్యాగమూ, కాక, ధనమూ, నగలూ, స్వంతసౌఖ్యమూ చూచుకునే స్త్రీని మెచ్చరు. మరీ భర్తలేనిస్త్రీ, తన హృదయంలో పొంగే పేర్మను యేంచేస్తుంది? ఎవరిమీదనో చూపుతుంది. భర్తపోవడంతో ఆమె పేర్మకూడా చావదు. పేర్మగల హృదయమూ వుండాలి. ఆ పేర్మ యెవరిమీదా చూపనూకూడదు అంటారు. అగ్ని వంటచెయ్యాలి చెయ్యి కాలకూడదు అన్నట్లుంటుంది.

భర్త ఐనవాణ్ణి, ఎటువంటివాడైనా, ఏమీచేసినా పేర్మించాలని శాస్త్రాలు విధిస్తున్నాయే. అట్లానే అనుసూయ డాక్టర్ని అతను ఎటువంటి వాడైనాసరే, ఏమిచేసినాసరే, పెళ్ళికానీ, కాక పోనీ, పేర్మించింది సావిత్రిలాగు.

28

# అత్తిల్లు

"ఇంత చిన్నవాడివినీకు అప్పుడే బైస్కిలు బండి యెందుకురా ?"

"నాకంటె చిన్నవాళ్ళంవరూ యెక్కుతున్నారు. నాకు సిగ్గుగా వుంది. బడి యెంతోదూరం! యెండలో నడవలేక నడవలేక ఆలస్యంగా చేరుకుంటే పంతులు కోప్పడుతున్నాడు. నీకేం? యింటో కూచునేదానికి నీకేంతెలుస్తుంది. నాకష్టం!"

"నన్నడుగుతావేం? తాతయ్యనడుగు."

"తాతయ్యకేం తెలుసు? నీదా, తాతయ్యదా ఆస్తి?"

"మంచివాడవే! చూద్దాంలే! పంటలురానీ!"

"ఏదడిగినా చూద్దాం, పంటలురానీ అంటావు. నేను మానాన్న దగ్గిర వుంటే నాకుయెప్పుడో కొనిపెట్టేవాడు. ఒకసైకిలు కొనిపెట్టలేని పెంపకం యెందుకుచేసుకోవాలి?"

"ఇట్లా అడిగేవాళ్ళు ఎవరూలేరని. యీపాటివూరుకో. యెవరన్నావింటారు!"

అని తనపెంచుకున్న కొడుకు సూర్యనారాయణదగ్గిర్నించి లేచి వెళ్ళిపోవాలని చూసింది అనుసూయ. వాడికి పదిహేనేళ్ళు. సెకండుఫారం చదువుతున్నాడు.

"యెవరువింటేనేం? నాకు సైకిలు కొనిపెట్టకపోతే నేను మావాళ్ళింటికి పారిపోతాను."

"కొంచెం పెద్దవాడివికావాలి నువు. దానిమీదనుంచి పడి కాళ్ళూ చేతులూ విరుచుకుంటే ?"

"ఏమీ విరుచుకోను. ఎక్కేవాళ్ళుండరూనో ? నీడాక్టరు తప్ప యింకెవ్వరూ, సైకిలు యెక్కకూడదనా ?"

"నాడాక్టరెవర్రా ? మరీ మాటలు మీరుతున్నావు ?"

"యెవరికి తెలీదనీ ? పరాయి మొగాడితో నీకామాటలెందుకు ? నాతల్లి యిట్లాంటిదంటే నాకెంత తలవొంపులుగా వుంటుంది ? నేను వొప్పుకోను యిట్లాంటి సంగతులు. నాయనమ్మ మంచినీళ్ళ చెంబు యింటిలోకి తీసికెళ్ళినప్పుడు, నీతో యేమిటి, వినపడకుండా అంటు న్నాడు? వాణ్ణి వాడి దొంగటోపీని చూస్తే, నాకు వొళ్ళుమంట. మనింటికి రోజూయెందుకొస్తాడో యెవరికితెలీదని ? నువ్వు జాగ్రత్తగావుండాలి; వాడెవడో మంచివాడనుకుంటున్నావు. ఏ బోగంవీధుల్లోచూసినా వాడే !"

"నీకెందుకు యీ సంగతులు ?"

"అవును, నాకెందుకు ? నీకుకావాలిగాని"

"నాతో ఘట్టాడకు. అవతలికిపో."

కళ్ళనీళ్ళుపెట్టుకుంటో అనుసూయ గూట్లో అట్లానే కూచునివుంది.

తలవెంట్రుకలసంగతి వాళ్ళవాళ్ళతో ప్రకాశరావు ఒకసారిగావును ప్రస్తావించాడు. కాని అతనేం సహాయం చెయ్యలేదు. చెయ్యలేడనికూడా అనుసూయకి తెలుసు.

ఆవాళ రాత్రి పదకొండింటికి ఆస్పత్రి వరండాలో ప్రకాశరావూ అనుసూయ నుంచుని వున్నారు.

"నిన్న యెవరన్నా అనుమానపడ్డారా ?"

"లేదు, కాని సూర్యనారాయణకి యేదో అనుమానంగా వున్నట్టుంది"

"వాణ్ణిసూస్తే నాకు అరికాలుమంట నెత్తికొస్తుంది. మంచికొడుకుని సంపాదించావు !"

"వాడిసంగతి పోనీలెద్దురూ. చిన్నవెధవ, వాడికేం తెలుసు!"

"వాడికంటే నువ్వెంత పెద్దదానివి!" అని నవ్వాడు.

"వెన్నెల అందరూ బావుంటుందంటారు. నాకూ బావుంటుంది గాని, ఆ గొప్ప అందమేమిటో తెలీదు."

"నాకుమాత్రం యీవెన్నెలమీద చాలా కోపంగావుంది. ప్రస్తుతం చీకటిగావుంటే.........నిన్నీపాటికి యిట్లాయిట్లా పట్టుకుని...."

"మరీ వెన్నెట్లోకి జరుగుతున్నారు. జరగండి కొంచెంలోపలికి."

"యేమిటా జాగ్రత్త....చలిపోయిందా? యింకా కోటులోకిరా, యిట్లానుంచో, యెదురుగా, దగ్గిరిగా.........యేమిటి? యేదో కొత్త నగలు వేశావు మెళ్ళో? గడియారం గొలుసే? యిట్లావెన్నెట్లోకిరా, చూడనీ.........పరవాలేదు లెద్దూ....యెవరుచూస్తారు? మర్యాదా, హోదా యెక్కువైనట్లుంది....పెద్దకుటుంబానికి యజమానురాలవైనావు. కొడుకూ, కోడలూ....యింతాచేస్తే నా బుజంయెత్తులేవు.........యీ నున్నటివొంటి మీద యెట్లామెరుస్తుందో! గొలుసు చివరలాగనీ—యీబిళ్ళేమిటి కళా వరు....ముద్దుపెట్టుకోనా!.........యే సుందరప్రదేశాల్లో దాక్కుందో యింతసేపు! యింత చలిలోకూడా వెచ్చగావుంది. యెంత మంచివాసన సబ్బు! అందుకనే వితంతువులని అన్ని కట్టుదిట్టాల్లో పెట్టారు."

"యింగ్లీషుడాక్టర్లు అవన్నీ తొలిగిస్తున్నారుగా."

"యివన్నీకూడా తొలిగిస్తారు."

ఆమె గొలుసును యెప్పటివలె సర్దాడు.

"నాకంటె ఆబిళ్ళే అదృష్టమైనది." అన్నాడు.

"యేమీ?"

"నేనెన్నడూచూడనిస్తలాలన్నీ తిరుగుతోందియెప్పుడూ!"

ఆమెబుజంచుట్టూ చెయ్యేసి, దగ్గరిగా నుంచుని కళ్ళుమూసుకున్నాడు.

"యెందుకట్లా అనుకుంటావు నామీద?"

"అన్నీ అట్లానే అనుకుంటారు మీరు. యిందాకా చలివేసేనా యేం మీకు...."

యిద్దరూ నవ్వారు.

"యీకోటు యింత పొడుగేం? యిద్దరం దీంటో దూరవొచ్చు. యీ పెద్ద జేబుల్లో యేముంటాయి? యీ సిగరెట్టుముక్క లెందుకు దాచుకున్నావు? యీ కాయితం, యీ గాజుగొట్టం, యివన్నీ యేమిటి? చిన్నపిల్లాడిలాగు యివన్నీ దాచుకుంటున్నావా? మళ్ళీ తెల్లారితే గొప్ప డాక్టరుగారు? కలెక్టరికి జబ్బుచేసినా యీయనే వెళ్ళిచూడడం?"

పద్దెనిమిదేళ్ళ మొద్దు నీకు చిన్నపిల్లవాడుకాగా లేనిది నేను కాకూడదా యేమిటి? పోనీ నన్నే పెంచుకోకపోయినావా వాడిబదులు! పెంపకం చేస్తున్నారంటే యే చంటిపిల్లవాణ్ణో అనుకున్నాను. యింత చిన్న పాపాయిని పెంచుకుంటున్నావని తెలిస్తే, అంతకంటె చిన్నవాణ్ణి నేనని, పెంపకమొాదును. అప్పుడు హాయిగా 'అమ్మా, అమ్మా' అనుకుంటో రాత్రింబవళ్ళు నిన్ను పట్టుకుని.........

అనుసూయ అతని నోరుమూసింది.

"అట్లాంటి మాటలంటే నేనురాను మరి."

"రావూ? వొస్తావు"

"అవును ఏం. తెలీని దాన్ని పిచ్చిదాన్ని చేసి........"

ప్రకాశరావు యేదో ఆలోచిస్తున్నాడు.

"యింక వెడతా. యెవరన్నా లేచారేమో!"

"అప్పుడే వొద్దు."

"నిన్న చందమామ ఆ పెద్దకొమ్మచివర వున్నాడు. యివాళ నెత్తిమీదకొచ్చాడు. అప్పుడే! చూడండి."

"చాలాబాగా తెలుసే నీకు టైము కనుక్కోడం! వాచీచూడు — యిదిగో—పన్నెండుకాలేదు."

"మీవాచీలో యెంతైతే నాకేం? తిప్పుతారు మీరు సామాన్యులా!

నాచందమామచూడండి''

''శనివారం రాత్రి మళ్ళీ యిక్కడే. మళ్ళీ చెప్పలేదనుకోకు. వీలువుంది. మొన్నటి ఆదివారం చేసినట్లు చేశావా, చచ్చిపోతాను. అలవాటైపోయినావు నాకు. యెప్పుడన్నా దీనికి అంతమేవుంటే. యెట్లాబతుకుతానో తెలీదు.''

అనుసూయ అతని కోటుమీద చెంపల నానించి పరిగెత్తుకెళ్ళింది.

ఆమె పరిగెత్తడంచూస్తే ప్రకాశరావుకి చాలాయిష్టం. అంతసేపు ఆమె అందం చూడనట్టేతోచి 'అనుసూయా' అని కేకేశాడు, ఆమె తీగెలదగ్గర నీడలో ఆగి వెనక్కిచూసింది. మళ్ళీ అతని దగ్గరకి వెన్నెట్లో వెడుతో, యెవరన్నా చూస్తారని భయపడి చీకట్లోకి వెళ్ళమని సౌజ్ఞచేసింది. ప్రకాశరావు రెండు నిమిషాలు నుంచుని యింటివేపు నడిచాడు.

ఇన్నాళ్ళు యింతస్నేహంచేసినా, తనకి స్వాధీనంకాక అనుసూయ తిప్పలు పెడుతోందని అతనికి విసుకుగావుంది. ఎక్కువ చనువు తీసుకుంటే తరువాత పదిరోజులు రావడం మానేస్తుంది. కాని అతనికీ రాత్రులిట్లా అనుసూయతో తమాషాగా గడపడం చాలా ఆనందంగా వుంది.

అనుసూయ తీగెలుదూకి, తలవొంచుకుని వంటింటి తలుపుతీసి లోపలికివెళ్ళి, గడియవేసి చావిట్లో మంచంమీద కూచుంది. గోడకి దీపంబుడ్డి వెలుగుతోంది. మామా అత్తా, యిద్దరూ పక్కగదిలో గురకపందాలేసుకుంటున్నారు. సూర్యనారాయణ వూళ్ళో స్నేహితులతో చదువుకుని అక్కడే పడుకుంటున్నాడు. అనుభవించిన 'ఎక్సైట్‌మెంట్' వల్ల నిద్రరావడంలేదు. ఇంకా ప్రకాశరావుతో బైట వుండిపోవాలని పిస్తోంది. మళ్ళీ వెడితే వుంటాడా ? వృథాగా తొందరపడి వొచ్చేశానను కుని. మళ్ళీ లేచి చప్పుడు కాకుండా దొడ్లోకివెళ్ళింది. గేటు దాటు తున్న ప్రకాశరావు కనపడ్డాడు. 'ఏమండి' అని కొంచం బిగ్గిరిగా

కేకేసింది. అతను వెళ్ళిపోయినాడు, వినపడలేదో ఏమో ?

అప్పుడే యెందుకు వెళ్ళిపోవాలి ? నేను మళ్ళీ వొస్తానేమో అను కోకూడదూ ? అని కోపం తెచ్చుకుంది. వెన్నెలవంక చూస్తూ ఆ విశాల శాంత సముద్రం మధ్య నుంచుంది. పారిజాతం పువ్వులు నాలుగేరి తలలో పెట్టుకుంది. ఇటూ అటూ తిరిగింది. బాదంచెట్టు నీడకింద బావివెనక చూసేప్పటికి దొంగలు జ్ఞాపకంవొచ్చి, మెళ్ళో గొలుసుతీసి చూసుకుంది, దాన్ని బావుందన్నాడుకదూ ? ఆ బిళ్ళ యేంవాసనేసింది ? వాసనేం కనపట్టంలేదే ? దాన్ని ముద్దుపెట్టుకుని దీర్ఘనిశ్వాసం విడిచింది. తన మెడమీద యెంతో అందంగా వుందన్నాడు ఆ గొలుసు. ఎట్లా కనపడి వుంటుంది ? ఇంట్లోకివెళ్ళి అద్దంతీసుకుని మంచంమీద కూచుంది దీపం అద్దంమీద పడేట్టు—మొహంఒకటిగావుందే ? ఇటుతిరిగి అటుతిరిగి మొహం కనపడేట్టు చేసింది. తనకళ్ళు సీతామహాలక్ష్మి కళ్ళలాగుండ కూడదూ ? పెద్దగా కోలగా ! జుట్టువిప్పి మొహం మీదికి లాక్కుని చూసుకుంది. ఇప్పుడతను తనని చూస్తే—శనివారం రాత్రి జుట్టిట్లా పెట్టు కుని వెళ్ళాలి. చూడగానే ఆ అందంచూసి ఆశ్చర్యపోతాడు. కళ్ళు కొంచెం పెద్దగా కనబడేట్టు కాటిక పెట్టుకోడానికి వీలైతే ! అత్త బొట్టు పెట్టిలోని కాటిక పెట్టుకుని వెడితే ! తెల్లారి వాళ్ళు లేవకముందే కడిగేసుకోలేనూ ? అయినా వెన్నెట్లో కాటిక కనబడుతుందా అతనికి ?

ఏమీతోచదు. నిద్రరాదు. ఏదో చెయ్యాలనిపిస్తుంది. ఏమి చెయ్యాలో తెలీదు. వెన్నెలకేసి చూస్తుంది. చూస్తున్న కొద్దీబాధ కాని ఆ వెన్నెలనూ, బాధనూ వొదలలేదు — యవ్వనంలో ఆబాధ ఎంతో దుస్సహమనిపిస్తుంది—యవ్వనం పోయిం తరవాత ఆ బాధలేదే అని యేడుస్తారు.

అనుసూయ మర్నాడు పొద్దున్న ఎనిమిదింటికి లేచింది.

"మరీ యీఅమ్మ యింతపొద్దెక్కి లేస్తుందేం ? రాత్రంతా యేంచేస్తుంది ? పరీక్షలా ? చదువా ? ఆడాప్టరుగాణ్ని తలుచుకుంటూ

జాగారంచేస్తుంది గానును !'' అంటున్నాడు సూర్యనారాయణ, ఫస్టుఫారం జయించిన వస్తాదు.

* * *

నీతివేత్తలు, మనుషులకు ముఖ్యంగా స్త్రీలకు శరీరము వుందని మరిచిపోతారు. కొన్ని పరిస్థితులలో నరాలు ఉద్రేకంతోనిండి బాధపడతాయి—ఎంతప్రయత్నించినా అవి శాంతించవు, మనోబలమూ, యింద్రియ నిగ్రహమూ బోధిస్తారు, కాలునరం లాగేప్పుడుగాని, తలనొప్పి వచ్చినప్పుడు కాని ఆ యింద్రియ నిగ్రహం నీతివేత్తలకు ఎంతవరకు సహాయపడుతుందో ! సాధారణంగా యీనీతివిశారదులకు కామబలం తక్కువ. వెన్నెలవల్లనూ, పువ్వులవల్లనూ, వారికి యేమాత్రమూ, అశాంతిగాని, బాధగానికలగదు. రక్తాన్ని వుడికెత్తించి అర్థంకాని వేదనతో, తపనపెట్టే మహారసికత్వం వారినిపట్టదు. అజీర్ణవ్యాధితో బాధపడేవారు, తిండుపోతుల్ని ఎట్లావెక్కిరిస్తారో, నైతికాధికారులూ, సంఘాధికారులూ ఆవిధంగానే యవ్వన జ్వరంతో బాధపడేవాళ్ళని దండిస్తారు.

# పుట్టిల్లు

మొన్న సూర్యనారాయణ పెద్ద తగూపెట్టాడు. వాడిపక్షం అత్తా, మామా కూడా అందుకున్నారు. సూర్యనారాయణ తనకి తల నొప్పిగా వుందంటే, వాళ్ళ బళ్ళో కుర్రాడు

"నీకేంరా! డాక్టరు నాన్నగా రుండగా తలనొప్పికి మందే దొరక లేదా?" అని,

యింకోడితో "అదృష్టమంటే వీడిదిరా—వీణ్ణికన్న తల్లితండ్రి వుండగా, అందమైన తల్లీ, డాక్టరు తండ్రి దొరికారు. ఆస్తి సరేకద! వీడికింక చదువెందుకు అనిఅన్నాట్ట?"

ఆమాటలతో సూర్యనారాయణ యేడ్చి యిల్లంతా గోలచేశాడు. ముసలివాళ్ళకి అనుసూయ చేస్తున్నదేమీ తెలీదుగాని, ఆనిందకు ఆమె బాధ్యురాలైనట్టు వాణ్ణి వెనకేసుకొచ్చారు.

"మనకి తెలీకండా వాణ్ణెక్కడ కలుసుకుంటోందో?" అన్నాడు కూడాను సూర్యనారాయణ. కోపమొచ్చి అమ్మా వాళ్ళింటికి వొచ్చేసింది అనుసూయ.

అమావాస్యరాత్రి, అమ్మ ముట్టయింది. అమ్మ ఆ అరుగుమీద పడు కుంటే యీఅరుగుమీద అనుసూయ పడుకుంది. ఈసారి వొచ్చినప్పణ్ణించి మా మామయ్య సీతారామయ్యతరహా ఒకమోస్తరుగావుంది, తనలో యేదో కొత్తమార్పు చూచి విభ్రాంతుడైనట్టు చూస్తున్నాడు. తనని కొంచెం పెద్దదాన్నివలె గౌరవంచేస్తున్నాడు. పెంపకమయిగంనేమో! మళ్ళీ

సూర్యనారాయణ సంగతి విని బాగా తిట్టాడువాణ్ణి. డాక్టరు సంగతంతా వాడు కల్పించిందే అన్నాడు. అతనూ అత్తా ఆగదిలో పడుకుంటారు. ఎండాకాలమైనా అత్తని బైట పడుకోనీడు. ఎంత వుక్కగావుందో.... యీవాళ! యీవుక్కలో ఆగదిలోయెట్లా నిద్రపడుతుందో యీ దోమల్లో? నిన్నరాత్రి అత్తయ్య అర్థరాత్రి తనపక్కలో పడుకుంటే లేపుకువెళ్ళాడు. ఇంకా నిద్రిపట్టదు.

ప్రకాశరావువగ్గరికీ ఆస్పత్రికి వెళ్ళాలనివుంది. వెన్నెల పోయింది. చీకట్లో భయంలేకుండా అతని భుజంమీద చెయ్యేసి చెంప ఆనిస్తో తిరగవొచ్చు. కింద తేళ్లూ పాములూ వుంటాయని భయం. తనకికూడా బూడ్సులుంటే యెంతబాగుంటుంది! ఏంచేస్తున్నాడో ప్రకాశరావు? అతని యిల్లెట్లావుంటుందో!

మళ్ళీ ఆదివారంరాత్రి వొస్తానంది. ఆస్పత్రికి. ఆలోపున వెళ్ళాలి అత్తగారింటికి. కాని ఆ వెధవ సూర్యనారాయణ! వాణ్ణి బాగా తంతే?

నిద్రిపట్టింది. ఎవరో లేపుతున్నారు. ఎందుకు? వుందూ, అబ్బా! ఇంకా చెయ్యిపట్టుకుని కదిలిస్తున్నాడు. ఎందుకబ్బా? లేచింది. పక్కలో యెవరు అత్తయ్యా....మాట మాట్లాడరు. యెవరో? లేచి రమ్మని చెయ్యిపట్టుకుని లాగుతున్నారు. ఈ అత్తయ్య మళ్ళీవొచ్చి పడుకుందిగావును. లేవదీసి తనని యెక్కడికో తీసుకుపోతున్నారు. గది గుమ్మం కాళ్ళకి తగిలింది. పడతా—యెందుకట్లా గట్టిగా పట్టుకుంటారు? ఎవరు?—నొప్పి—వొదులు. అక్కడ పట్టుకోక. ఎవరు? కళ్ళుతెరిచింది. కటిక చీకటి యెవరో చెప్పు. చెపితేనేగాని రాను. నేనూ? నేనంటే?........యెవరు? మామయ్యా....నువ్వు! యెందుకు? ........రాను....ఆగదిలోకి 'యెందుకు?....లాగకు....ఏమిటిది తగుల్తోంది....మంచం....తొయ్యకు నన్ను....విచ్చి వొదలటం లేదు. అరిస్తే వొదులుతాడేమో?

"అమ్మా, అమ్మా"

మామయ్య అంటున్నాడు. "మీఅత్తయ్య అనుకున్నాను. నిన్ను-చీకట్లో. ఎంత పొరపాటు! యెవరితో చెప్పకేం? నిన్ను చూసి నలుగురూ నవ్వుతారు. అమ్మతోనైనా చెప్పకు. చెప్పవుకద? చెప్పనను వొదుల్తా?

"సరేలే!"

38

# అత్తిల్లు

"ఎప్పుడన్నా నాకు బదలాయింపై వెళ్ళిపోతే నువ్వేమౌతావు?"

"ఏమీకాను. ఏమౌతాను! ఏమో, ఏమౌతానో!"

"నీకు దిగులెయ్యదూ?"

"నా ఖర్మం—యేంచేస్తాను?"

"ఇవాళంతా యేంచేస్తున్నావు? మధ్యాన్నం యింటికొస్తే కనపడ లేదేం, దొరసానిగారు!"

"మిమ్మల్ని వాళ్ళందర్లోనూ చూడడం భయంగావుంది. నా మొహంలో సంతోషం, నా కళ్ళల్లో ప్రేమా అందరికీ కనపడుతున్నట్టున్నాయి."

"ఏదీ, నన్ను చూడనీ కనపడుతున్నాయేమో!"

"మీకు కనపడవు. వాటిని యెక్కడ కనపడ్డా చంపేందుకు వెతికేవాళ్ళకిమాత్రం కనపడతాయి."

"ఎవరన్నా యేమన్నా అన్నారా?"

"సూర్యనారాయణ ముఖ్యం. మొన్న 'అమ్మ యెప్పుడో అప్పుడు డాక్టరుతో లేచిపోయేదే!' అన్నాడు అందరి ముందరాను!

ఏంచెయ్యను? మొన్నరాత్రి తలుపుచాటున దాక్కున్నాడు నేనెక్కడికన్నా వెడతానేమో చూడ్డానికి"

"మనం యిక్కడ కలుసుకోడం అద్దే మంచిదనుకోను."

" చూడనీండి, చూస్తేచూశారు. చూడనీండి."

"భయంలేదూ ? వూరుకుంటారా ?"

"ఏమో ! ఏంచేస్తారో చెయ్యనీండి."

"నాకుమాత్రం నలుగురినోళ్ళలోనూ పడడం యిష్టం లేదు."

"ఎందుకు భయం ? మనం యేంచేస్తున్నాం ? రాత్రి వెన్నెట్లో కొంచెంసేపు మాట్లాడుకోడం మహాతప్పా ?"

"వాళ్ళంతే అంటారా ? ఈ వాదనెందుకుగాని యిట్లాకూచో. మంచుతో తడిసింది. ఇక్కడ వుంటే యెప్పుడో ఒకప్పుడు యెవరో ఒకరు చూసేమాట నిజమే. లోపల కూచుందాం, కుర్చీలున్నాయి. తలుపు తీసివుందేమో చూస్తాను."

ఆడది భయపడ్డంతసేపే మొగవాడి ధైర్యం.

"నేను లోపలికి రాను."

"ఎన్నాళ్ళు మొండితనం ?"

"నేనురాను. తప్పు."

ప్రకాశరావు నవ్వాడు.

"ఇది తప్పుకాదూ ? యిట్లారా."

చీకటీ, వొంటరితనమూ, అసహాయమైన బాలిక తనచేతుల్లో వుండడమూ, ప్రకాశరావు రక్తానికి వేడెక్కించాయి. ఈ పిల్ల యిన్నాళ్లు తన నెట్లా తప్పించుకుంటోంది ? తన అశ్రద్ధచాతనే; తన నెమ్మదితనం వల్లనే. ఇట్లాతను తాత్సారం చేస్తే యింకెవరో తీసుకుంటారు. దగ్గిర చేరి శరీరాన్ని వొత్తుగా ఆనించి చేతులతో, అంతా స్పృశిస్తో ఆమె నుద్రేకింపచేయ ప్రయత్నించాడు. అనుసూయ వలవాసనతగిలిన లేడి పిల్లవలె అదరిపడి లేచింది, అతనూ లేచి "రా, అనుసూయా, నన్నేడి పించకు. నాకుతెలుసును నేను నీకు కావాలని. చూడు—నీకళ్ళల్లో సిగ్గు చెప్పడంలేదూ ?" అన్నాడువేడిగా.

అనుసూయ, ప్రయత్నంమీద బలం తెచ్చుకుంది, అతన్ని తోసేసి అరుగుమీదనించి కిందికి దిగింది. ప్రకాశరావు ఆమెను యామైనా వొవలతలచుకోలేదు. కిందినించి పైకి లాగేశాడు.

"....నిన్ను వొవలను........ఇంక యిట్లాఐతే నేను రాను. చూడు. ఎందుకు నీకాభయం ? నేను డాక్టర్ని. అంత భారం నామీద వెయ్యి. ఒకసారి............"

అనుసూయకి పెద్దభయం పట్టుకుంది, ఏంచెయ్యాలి ? మళ్ళీ వొదిలించుకుని యింటికేసి చూసింది.

"పోనీండి రాకపోతేపోయినారు, నేనుండను. నన్నట్లా ముట్టుకోవద్దు. వుండండి యెవరో వొస్తున్నారు."

వొదిలించుకుని ఒక్కపరుగు తీసింది. వెనక డాక్టరు రొజుతూ వెళ్ళాడు, తీగెలు దూకేస్తోవుంటే, చెరుగు పట్టుకున్నాడు. చీరె పర్రుమని చిరిగి డాక్టరు వెనక్కి కూలపడ్డాడు. వెనక్కి తిరిగిచూసి నవ్వు ఆపుకోలేక నవ్వి పారిపోయింది.

* * *

ప్రకాశరావుకి చాలాకోపం వొచ్చింది. ఆమెని యింకెప్పుడూ చూడకూడదని నిశ్చయించుకున్నాడు. పదిరోజులు గడిచాయి,

అతను అనుసూయగారి యింటికన్నా వెళ్ళలేదు. బాధగావుంది అనుసూయనిచూడక పోవడం. ప్రేమకన్నా కోపం యెక్కువగావుంది మరి. తనకి దొరక్కపోవడం — అనుసూయ ఆ తెలివితక్కువపిల్ల తన వాంఛని ధిక్కరిస్తుందా : లోబరుచుకుని, ఆ అల్లరి కంఠంలోంచి జాలివొలికే ప్రేమ శబ్దాలు రప్పించాలి, ఇంక శక్తిలేక తనపాదాల దగ్గిర పడిపోవాలి ఆమె,

అనుసూయ మాత్రం డాక్టర్ని యింక యెన్నటికీ చూడకూడదని నిశ్చయించుకుంది. తరతరాలనించి వొస్తున్న గుణాలు మనుషులు మృగస్థితిలోవున్ననాటి లజ్జా, బెట్టూ, నిగ్రహమూ, ఇంకా మనుషుల్లో పూర్వంనించి వొస్తున్న, పాపమంటే భయమూ, లోబడితే నాశనమవు తామనే నిశ్చయమూ యివ్వన్నీ ఆమెకి తెలీకండా, ఆమెని కాపాడు తున్నాయి.

కాని విధి వేరేవిధంగా తలిచింది. ఆమెని నీతిలోవుంచాలని తంటాలుపడే ఆమెమనుషులే ఆమెని డాక్టరు చేతుల్లోకి నెట్టారు.

వ్యభిచారాల్లోకీ, వైరాగ్యాల్లోకీ కూడా బలవంతాన మనుషుల్ని నెట్టేది ఆప్తులే. వారి బుద్ధిహీనత్వంవల్లా, క్రూరత్వంవల్లా.

అనుసూయ జుట్టు తీయించడానికి ముహూర్తం నిశ్చయమయింది.

డాక్టర్ని కలుసుకోకూడదనుకుంది, కాని ఈ ఆపదలో ఎవరు దిక్కు!

42

# అత్తిల్లు

"బలవంతంగా లాక్కెడతారుట. ఎల్లుండే! ఏంచెయ్యనండి : తరవాత యెట్లాబతకను? ఎవరిముందైనా నామొహం యెట్లా చూపించను? మళ్ళీ మీదగ్గిరికి యెట్లారాను? ఎట్లా? మీరేదో సహాయంచేస్తామన్నారు. ఏంచేస్తారిప్పుడు? చెప్పండి....ముందుచెప్పండి....తరవాత నేను బతకను. ఎట్లానూ చచ్చిపోతా....రేపే....అట్లా అనకండి....మీకు తెలీదు. నేను చూడలా! బలవంతం చేస్తారు .... .... లోకమంతా హర్షిస్తుంది. పైగా వాళ్ళకే సహాయపడతారు. నేను చూడలా! వాళ్ళగరిమెళ్ళవారి అమ్మాయినేంచేశారు? ఏడుస్తో అరుస్తోతన్నుకుంటున్న దాన్ని రోడ్డంబడి మంచంలోవేసి కట్టుకుపోయి తీసేశారు. నాకు భయమేస్తోంది. మా మామయ్యకూడా వాళ్ళవేపే ఐనాడు. నేను రేపే చచ్చిపోతా. మీరేమన్నా మందిచ్చి మీచేత్తోనే చంపండి."

అని అనసూయ ఆరాత్రి ప్రకాశరావు కంఠంకావిలించుకొని యేడ్చింది. అతనేవేవోచెప్పి వోదార్చాలని చూశాడు. కానిఆమెకివిశ్వాసం కలిగించలేక పోయినాడు.

"ఇప్పుడిట్లా యెందుకు నిశ్చయించారు వున్నట్లువుండి?"

"ఆ సూర్యనారాయణ వెధవ. వాడే. వాణ్ణొక్కసారి తన్నలేరూ మీరు? మీకూ నాకూ సంబంధంవున్నదని వొకటే వాగుడు ప్రతిచోటా; పొద్దున్నలేస్తే అదే పనివాడికి.

'అమ్మ ఎప్పుడో ఆడాక్టరు వెధవతో లేచిపొయ్యేదేకాని....'

అంటోవుంటాడు. వాళ్ళకి అనుమానంతోచింది. ఊళ్ళోఅంతా అంటున్నారట, ఏమేమిటో! వాడి స్కూలుపిల్లలు యేదోఅన్నారుట వాణ్ణి. ఒకటే తిట్టాడు నన్ను ఆ సాయింత్రం. అందరినోళ్లూముయ్యాలని యీపనికి నిశ్చయించుకున్నారు....

ఈ రాత్రి దొడ్డివగ్గర కావిలికూచున్నాడు వాడు. రహస్యంగా, వాణ్ణి బైటపెట్టి తలుపేశాను. నిద్ర ఆపుకోలేకపోయినాడు గావును.

అబ్బా చాలా తల నొప్పిగా వుందండీ వాడిసంగతి చూస్తే! ఎందుకు నన్నిట్లా యేడిపిస్తాడు? లోకమంతా నన్నెందుకిట్లా యేడిపిస్తుంది నా సంగతి వాళ్ళకెందుకు? నేనేమన్నా వాళ్ళజోలికివెళ్ళి, వాళ్ళని అల్లరి పెట్టానా? వీణ్ణొక్కణ్ణి నాకెందుకు కట్టిపెట్టారో!....వీళ్ళందరిని, బంధువుల్ని లోకాన్ని వొదిలేసి యెక్కడికన్నా వెళ్ళిపొయ్యే వీలేవుంటే—

"నన్నూ—"

మిమ్మల్నిని. మొగవారు మిమ్మల్ని నమ్మాను. ఏమీ సహాయం చెయ్యలేరూ! మీ ప్రేమ లేకుండా మిమ్మల్నిట్లా కలుసుకో కుండా బతకడం యెట్లా?"

అతని బుజంమీద వేళ్ళాడుతో యేడుస్తోంది, అతనికి వోదార్చే మార్గం తెలీలేదు. చుట్టూ మెల్లిగా చేతులుపోనిచ్చి ముందుకు లాక్కున్నాడు. మొహంయెత్తి ముద్దుపెట్టుకుని, ఆమెని గట్టిగా అదిమి మెల్లిగా గదివేపు తీసికెళ్ళాడు. మొగాడికి ఆడదాన్ని వోదార్చేమార్గం అదొక్కటే తెలుసు.

'పాపం, యెన్నికష్టాలో నీకు, నేనున్నానుగా, నేనుండగా యెవరేంచేస్తారు? నిన్నిట్లాపట్టుకుంటే యెవరొస్తారో రమ్మను, ఈబాధలన్ని పోగొడతాగా, అన్నీ మరిచిపొయ్యేట్టు చెయ్యనా?'

ఇంటిదగ్గిర ఆ ముసలివాళ్ళతో పడివుండడం, తన పెంపుడు కొడుకు తన ప్రాణాలు కొరుక్కుతినడం, వాడిఅనుమానాలకీ,

అసహ్యపు మాటలకీ తను పడవలసి రావడం, యెవరు చూస్తారో అనే భయంతో తనుప్రతిరోజూ మాయోపాయాలు పన్నడం, తన వెంట్రికలు తీసేస్తారని యీ అల్లరీ, భయమూ, తన నిర్మలమైన ప్రేమకి యీ విఘాతాలూ, యివన్నీ జ్ఞాపకం వొచ్చి, విసుకూ, అలసటా కలిగాయి. యిదివరకంతా తల్లిమీద ప్రేమ రక్షరేకుగావుంది, కాని తనవెంట్రికలు తీయించవొద్దని యెంతయేడ్చినా ఆ తల్లి విన్నదికాదు. పైగా తాను ప్రకాశరావుని చూడడం మానుకున్నా, వాళ్ళ అనుమానాలు మానలేదు. ప్రజలు వాళ్ళకి తనకంటె యెక్కువైనారు. అంత నిర్దయగా చూసేతల్లిమీద తనకిమాత్రం యెందుకు ప్రేమవుండాలి ?

ప్రకాశరావు లోపలికి తీసుకుపోతోవుంటే వూరుకుంది. అతనితో పోట్లాడ్డానికి వుత్సాహమూ శక్తీ లేవు.

గదిలోపల పక్కమీద సగంవరకు వెన్నెల అందంగా పడుతోంది. అనుసూయ పరుపుమీద చీకట్లో కూచుంది.

"ఇట్లా వెన్నెట్లోకిరా. దగ్గిరిగా. బావుండాలా ? ఇట్లా వుండనీ. ఇన్నాళ్ళెందుకు భయపడ్డావు ? ఇంకా ఎందుకు ఆ చిన్నదుఃఖం ? వెన్నెలవేపు తిప్పు మొఖం, ఒకసారి నవ్వు, చిన్ననవ్వు చూపించు. కోపమా నామీద ?"

"చక్కిలిగిలి. వొద్దు, కొంచెంవుండండి ?"

"ఇన్నాళ్ళుదాచేశావు నాదగ్గిర్నించి. వుండు ఒకసారి చూడనీ ........చీకట్లోకి వొంగకు. వొదులు."

మూలలు కనపడని గదీ, వుదయించే చంద్రుడి వెన్నెలా, వొంటరిగా పరపురుషుడితో దగ్గిరిగా వుండడం, చాలాకొత్తగా, వింతగా ఆకర్షించింది. ఆమెని

* * *

ఆరాత్రి అనుసూయకి కొత్తసిగ్గు వొచ్చింది. పక్రికాళరావు వంక చూడదు. తల అవతలకి తిప్పేసుకుంటుంది. మాట్లాడదు. ఆవెన్నెలా, తనకంఠంలో నాడీ, హృదయమూ అన్నీ మాట్లాడుతో వుంటే. తనువేరే యెందుకు మాట్లాడాలి? అలిసి, సిగ్గుతో మూసుకునివున్న కళ్ళని ముద్దు పెట్టుకున్నాడు. రెండుచేతులూ జాచి అతని తలని గట్టిగా కౌగలించుకొని—

"నేను వెళ్ళను యింటికింక వెళ్ళను. నిన్నువొదిలి"

"యెందుకు వెళ్ళడం వుండిపో."

"తెల్లారినా—"

"తెల్లారిందాకా."

"అంతే?"

"తరువాత యెట్లా మరి!"

46

# పుట్టిల్లు

పొద్దుణ్ణించి అన్నంలేకపోవడమువల్ల అర్ధరాత్రైనా నిద్రరాదు. ఎలికలు మూలనించి మూలకి పరిగెత్తితే భయంగావుంది. చీకట్లో కరుస్తాయేమో! యెంతసేపు చప్పట్లుకొడుతో కూచోగలదు? ఎన్నాళ్ళుంచుతారు తనని యీ గదిలో? పొద్దున్న. అత్తకొట్టిన దెబ్బలు యింకా మంటపుడుతున్నాయి. తనని కన్న అమ్మకంటె, మొగవాడు మామయ్యకంటె, యీ అత్తయ్యకి యెందుకో కోపం? యేమైనా తను డాక్టర్ని చూడకుండా మానౌనని వొప్పుకోకూడదు. పాపం ఆయన తనకోసం దిగులుపెట్టుకోడూ? పోనీ, అమ్మా వాళ్ళూ అపరదిష్ట అంటారుగనక. తను వాళ్ళకోసం ప్రకాశరావుని వొదులుకోవచ్చు కాని ఆయన తనని అంతగా ప్రేమించేట్టు చేసుకుని ఆయన్ని వొదిలెయ్యడం ఆయనయడల న్యాయంకాదు. తనులేక వొక్కడూ యెట్టా గడుపుతాడు రాత్రిలు? వెన్నెలలో తడిసిన జుట్టుతో ఆడుకోడం తనని వదలలేక వదలలేక తిరిగిచూస్తో వెళ్ళడం, తను రావడం ఆలిస్యమైతే ముళ్ళమీదవలె బాధపడడం, తన అందంచూసి, కాంక్షించి అనుభవించడం అన్నీతలచుకొని చేతుల్ని వుత్తరొమ్ముకి బిగించుకొని పెదవులు ముద్దుపెట్టుకున్నట్టుగా చేసి తన్మయత్వంచెందింది. తనరొమ్ముకి అట్లా అతన్ని సిగ్గుతో వొత్తుకున్న నిమిషం, అప్పుడు వొంట్లోంచి పరిగెత్తిన విద్యుచ్ఛక్తి స్ఫురణకువొచ్చాయి.

ఎన్నాళ్ళు యిట్లా కట్టిపెడతారు ? వొదలగానే ఆయన దగ్గిరకి వెళ్ళిపోవాలి. ఈమూన్నాళ్లూ యామనుకుంటున్నాడో ! యేంగోల పెడుతున్నాడో ! ఒక్కఉటీ పంపడానికన్నా వీలుంటే బాగుండును ! కబురన్నా పంపితే !........యెట్లా ?

ఎన్నిదెబ్బలన్నా తినవొచ్చు ప్రేమకోసం తననుభవించిన సౌఖ్యంలో యీబాధ ఎన్నోవంతు ! కాని దెబ్బలుతినడం అసహ్యం. తనని అవమానపరిచినట్టు, మృగంతో సమానంచేసి నట్టయింది. అందులో అత్త ! ఆతాడుతో ! ఏం అధికారం తత్తకి తనమీద ! అత్త తప్పుచేస్తే తనచేత దెబ్బలుతింటుందా ? యింకోళ్ళనికొట్టడం యెంత అసహ్యం !

వాడు—సూర్యనారాయణ కొట్టడానికి మీదపడ్డాడు. మామయ్య గట్టిగా లాగేస్తేనేగాని లొంగాడుకాడు, వాడికెందుకో ఆకోపం ? వాకి స్నేహితులు వెక్కిరిస్తారని, ఆస్నేహితులకెందుకు ఆకోపం ? తన సంగతి యీలోకానికంతా యెందుకు ? యింతకోపం ! దాసీది రత్తి అది రోజుకి ఒకడితో వుంటుంది. దానికెంత కోపంవచ్చింది ! తిట్టు కూడా తిట్టింది తనని ! దొంగతనాలూ అవీ చేస్తే యింతకోపమురాదే ! మనిషిని చంపినవాణ్ణిచూస్తే కొంతభయమూ, గౌరవమూ వుంటాయి, కాని యిట్లాటి స్త్రీ మీదమాత్రం........

తనకి దిక్కులేక పోబట్టేకదూ యింతదౌర్జన్యం ! ఒక్కరూ తనవేపు పలికేవారు........ఒకవేళ పద్మికాశరావే, ఆసమయాన అక్కడ వుంటే తననిట్లా తిట్టేవారా ? అమ్మ జుట్టుపట్టుకు యీడ్చేదా ? యిప్పు డన్నా అతనికి తెలిస్తే వూరుకుంటాడా ? వీళ్ళందరినీ తన్ని తనని విడిపించడూ ? పాపం, వీళ్ళని అతను తన్నవొస్తే మామయ్యనీ, అమ్మనీ యేమీ చెయ్యవొద్దనాలి. మామయ్య తననేం చెయ్యలేదు. ఇంటికి మొగపెద్దయినా, అమ్మ తనని కన్నది. పెంచింది. యీ అత్తని, అతను, తనని అత్తకొట్టినట్టు కొడుతోవుంటే చూడాలనివుంది.

మామయ్య వూరుకుంటాడా ? వూరుకోకపోతె, ఆయనికికూడా తన్నులే! తనని వొదిలిపెట్టగానే అతనికి తెలియ చెయ్యాలి. తనని గదిలో పెట్టడమంటే యేమిటో తెలుస్తుంది వీళ్ళకి. ఈశిక్ష యెంతనీచం! రోజూ మొగుళ్ళతో సరసాలూ, అనుభవాలూ, మోహమూ తీర్చుకొనే వాళ్ళు వీళ్ళాతనని శిక్షించడం! తను యెంతో ఆనందంగా యింకోరిని ప్రేమిస్తే, దాన్ని, ఆ అనుభవాన్ని, యిట్లాంటి పాడు పేర్లతో పిలిస్తే తననీ తనప్రియుణ్ణి యెంతో అవమానపరచి నట్లయింది. యెంత అంపంగా, బలంగా, ధైర్యంగా, ప్రేమమూర్తివలె తనహృదయాన్ని యేలిన ఆ మహారాజునా, ఆ పాడు మాటలన్నీ వీళ్ళన్నది! ఒక్కమాటా జవాబు చెప్పకండా వూరుకోవలసివొచ్చిందా! తనచేతులు, వేళ్ళు, మొహం, యెంతో అందంగా అప్సరసవలె వున్నాయని మళ్ళీ మళ్ళీ ముద్దులుపెట్టుకున్నాడు. తనజుట్టుతో యెట్లా ఆడుకున్నాడు! ఆజుట్టుని పట్టుకుని యీడ్చింది అమ్మ. 'నెప్పో' అని యాడవడం, అతని చేతుల్లో ప్రేమతోనవ్విన తను యాడవడం యెంతో నీచమనిపించింది. మళ్ళీ ఆయన మొహమెట్లా చూడడం? లోకంలో తనూమనిషినని యెట్లా తిరగడం? తన అనుభవం వున్నతమని, సుందరమని వీళ్ళకి అర్ధంకాదా? లేకపోతే, లోకభయంవల్ల యిట్లా చెయ్యాలవుతారా? అస్వభావికము, పశుసమానము, ఘోరము, రాక్షసమైనపని చేసినట్లు చూశారు. అత్త రోజూ చేస్తున్నపనే, అమ్మ తనని కనడానికి పొందిన అనుభవమే! పరాయి పురుషుడనా? ప్రకాశరావు పరాయివాడనా? వీళ్ళందరికంటే తనకి ఆప్తుడు. ఎవరో కొత్తవాడు, మామయ్య, అత్తయ్యకి తన బంధువులందరికంటె యెక్కువవాడుకాలేమా? తనకి అట్లానే!

ఎవరు తలుపు తెరుస్తున్నారు. అమ్మే బహుశా! అకలిగావుంది. అన్నంపెడతారా? దీపంలేదే! ఎవరు? దగ్గిరికివొచ్చి కూచున్నారు. తినమని యింత పులిహోర ముందుపెట్టారు. ఎవరు? మామయ్య లాగుంది. నోరు మంటపుట్టి మంచినీళ్ళడిగింది తెచ్చియిచ్చాడు,

"పొద్దుణ్ణించీ నీ అవస్తచూస్తే దిగులేసిందినాకు. మరినువ్వు చేసిన పనేమిటిచెప్పు! ఈ సంబంధం మానుకోవాలి. అది మనకుల ప్రతిష్టకీ మన కుటుంబం పరువుకీ తగిన పనికాదు. వొప్పుకోవూ? మామయ్యని నాకోసం వొప్పుకోవూ?

గడ్డంకింద చెయ్యేశాడు చీకట్లో వెతికి.

"నిన్ను ప్రొద్దున్న అత్తయ్య కొడుతోవుంటే నాకెట్లా వుందనుకున్నావు? నన్ను కొట్టినట్టయింది. చిన్నప్పణ్ణించీ నీమీద నాకెంతో ప్రేమ అని నీకు తెలుసు కదా? నాతో ఎందుకు చెప్పలాముందే? యిట్లా మన ప్రతిష్ట పాడుచేసి, అన్యాయంగా దెబ్బలు తింటావా?' పాపం, చూడనీ, యెట్లా బొబ్బలు కట్టిందో—మందురాయినా?"

చేతితో నడుమును తాకిచూస్తున్నాడు. ఇదేమిటి మామయ్య యిట్లా చేస్తున్నాడు? లేచి పక్కగా వెళ్ళింది.

"ఎందుకు అట్లా వెళ్ళిపోతావు? నేనేగద! యెంతో ప్రేమ నీమీద! యెన్నాళ్ళనించో నీమీద మనసూ!"

చీకట్లో పట్టుకున్నాడు,

"ఇదేమిటి, మామయ్యా? నామీద నీకిట్లాంటి కోర్కె! ఛీ, ఛీ వొదిలెయ్యి.........అబ్బా! అరుస్తాను. వూ....వూపిరాట్టంలేదు. వొదులు" గట్టిగా పోట్లాడి వొదిలించుకుంది.

"అ డాక్టరు వెధవ విలవచెయ్యకపోతానా? చిన్నప్పట్నించీ నీ జాగ్రత్త తీసుకుంటే యిదా కృతజ్ఞత! వెధవబెట్టు. అబ్బో నీ నీతి; నీపాతివ్రత్యం నేనెరగనిదా?"

"పోనీలే నేను పాపిష్టిదాన్నే. నా సంగతి నీకెందుకు పో"

"పోతా, పోతా, నోరుమూసుకుని యిట్లారా"

"వొద్దు"

"నాబాబువికదూ? నీకింకేమీ భయంవొద్దు, నేను కాపాడతాగా? నిన్నెవరూ ఏమీ అనరు. నేననసీను. చంపేస్తాను. నీయిష్టం — కావలిస్తే

ఎవరికీ తెలీకండా ఆ డాక్టరు దగ్గరికి నేనే తీసుకుపోతా రా."

"ఛీ. ఛీ. అమ్మతో చెవుతానుండు. ఏమిటీ పాడుబుద్ధీ నీకు ?— యిన్నేళ్ళొచ్చి—"

"ఓసి తప్పుడుముండా, నీతులు బోధిస్తున్నావుటే—నీ మొహం నిన్నడిగేదేమిటి ? విను. ఇదివరకంటే నేనడగడమూతప్పే నువ్వు వొప్పుకోడమూ తప్పే ! కాని యిప్పుడేం అభ్యంతరం ? ఎట్లానూ చెడ్డావు. నేనోటీ వాడోటీనా ! అందులో మామయ్యని — చిన్నప్పణ్ణించి నిన్ను ప్రేమించినవాణ్ణి. నీ అత్త ఓబండ. మనిద్దరమూచేరి దాన్ని యేడిపిద్దాం—ఏం ? మాట్లాడు. ఇట్లాంటి యిష్టం నీకువుందని నాకు తెలీదు. తెలిస్తే వాడిదాకా పోనిచ్చేవాణ్ణా నిన్ను ! నాతో ఒక్కమాట అన కూడదూ ? ఆ రాత్రి జ్ఞాపకంలేదూ ? చూశాను యిష్టపడతావేమోనని ! 'ఛా పాపం ! ఏమెరగనిపిల్ల ! దానిజోలి నాకెందుకని' వూరుకున్నా ఏం? ఏమంటావు ?"

"ఉండు మామయ్యా, నాకిష్టంలేదు"

"ఇష్టం మహబాగా వుంటుంది, నా దగ్గరచెప్పకు కబుర్లు"

"వొదులు, వొదలకపోతే అరుస్తాను"

"అరుస్తావా ? అరుస్తావా ? నీగొంతు పిసుకుతాను, నీ నాలిక చీలుస్తా. వాణ్ణి రివాల్వరుపెట్టి కాలుస్తాను—ఎవరనుకున్నాడు ! మర్యాదస్తుల పిల్ల అనుకున్నాడా ? భోగం—అనుకున్నాడా ? ఎవడంట వాడు నీకు ? నీలుగుతావూపైగా ! పాడుపనిచేసి ! నోరుమూసుకో పడివుండు."

గొంతునొక్కాడు ఒకచేత్తో — ప్రాణం ఎగిరిపోతోంది తన్నుకుంది. దొర్లింది. చెయ్యికొంచెం వొదులుకాగానే బిగ్గరిగా అరిచింది. ఇద్దరు ముగ్గురు పరిగెత్తుకొచ్చారు.

"ఏమిటి ! ఏమిటి ! ఎవరు ? దొంగలు-దీపం దీపం-"

మామయ్య బట్టలు సద్దుకుంటో లేస్తున్నాడు.

"ఏంలేదు—ఏంలేదు-నీదుంపతెగా ! నాచేతుల్లో నీకు హత్యజరి

గిందేనే! ఎవరూలేరు_ఇదీ-ఇదీ_నీజింహతీస్తా_చూచుకో నాతడాఖా_ ఇది ఏదో కలవరిస్తోంది-కాదు పారిపోవాలని చూస్తోంది_

"ఎవరు! ఎవరు!"

"ఇదే-కిటికీలోంచి దూకి పోవాలనుకుంది. ఏమిటాఅని దీపం తెచ్చిచూస్తే-"

"అట్లాకాదు. దీన్ని కట్టివెయ్యాలర్రా! కాళ్లూచేతులూ విరక్కొట్టి-అసలు దీని మదమణచాలి. పెద్దమన్నాటివారి అమ్మాయికి చేసినట్టు-వాతలు పెడితేనేకాని బుద్ధిరాదు. ఇట్లాంటివాళ్ళకి_ఓ తాడు తేవే!"

"ఏమిటి యీఅర్ధరాత్రి? దానిమొహం పారిపోవడమేమిటి?"

పోయిపడుకున్నారు.

నిజమే మామయ్య మంచిమాట అన్నాడు_పారిపోతే!

డాక్టరెక్కడవుంటాడో, ఏంచేస్తోవుంటాడో? ఎంత ఆశ్చర్యం కలుగుతుంది అతనికి! కాని తనని యింటోనే వుంచుకుంటాడా? మరి వీళ్ళు వొచ్చి తగాదా పెడితే! పోనీ యింకోవూరు పోవొచ్చు, బదలా యింపు తెప్పించుకుంటాననికూడా అన్నాడు ఒకసారి. మరి వెంటనే వెళ్ళిపోవడానికి వీలుంటుందా? ఆ సంగతులన్నీ అతనే చూసుకుంటాడు, తనకెందుకు ముందే యీ సందేహాలు-అతని దగ్గిరికి వెళ్ళిపోయి, తరువాత యింకేం కావాలి తనకి? వీళ్ళు బాగా ఏడుస్తారు. కాని పాపం అమ్మఏడిస్తేతనకి దిగులుపుడుతుంది. కాని ఏంచెయ్యగలదు. తను?

ఇప్పుడెన్నిగంటలో మరి? ఇప్పుడుకాదు - వెడితే! ఆ రోడ్ల వెంబడి వొకత్తా! భయంకాదా? రేపు వెళ్ళాలి కాని పగలు అంచరూ చూడరా? అప్పుత్రికివెడితే యెట్లా? కాదు. రేపు సాయంత్రం చీకటిపడ్డాక పోవాలి.

## 52

# ఏ యిల్లూ లేదు

అమ్మా! ఇంటోంచి తప్పించుకోడం, అంత కష్టంగాలేదు గాని, ఆ రోడ్లవెంబడి చీకట్లో నడిచి, ఎవరికంటా పడకుండా రావడంమాత్రం చాలా ప్రయాస అయింది, ప్రతివారూ విరోధుల్లాగే తోచారు, ఎంత దూరమనిపించింది? కాని కష్టాలు గట్టెక్కాయి, డాక్టరు లోపల యెవరితోనో మాట్లాడుతున్నాడు. కొంచెంసేపు వరండాలో చీకట్లోనుంచుంది. ఆ కొత్తాయన వుండగా ఎట్లా లోపలికివెళ్ళడం? ఆలస్యమవుతోంది. తనవాళ్ళు తరుముకువస్తే! ఈపాటికి వెతుక్కుంటో వుండాలి.

నౌకరువొచ్చి, ఆమెనుచూసి, అడిగాడు, అనుసూయమ్మ వొచ్చింది చాలా జరూరుపనిట అని చెప్పమంది. ఈశ్వరుడి కరుణ అంటే అట్లా వుండాలి. అతను బుజంమీద చెయ్యివేసి లోపలికి తీసికెళ్ళిం తరవాత ఏం చెయ్యగలరు తనవాళ్ళు! పమిటా జుట్టూ సర్దుకుంది జవాను చెప్పడం వినపడ్డది. మాటల్లేవు. రాలేదేం? అవసరమైన పని కావును. కాని యీ బైట కూచోడమెట్లా. తెగించింది. తలుపు తోసుకుని లోపలికి నడిచింది. ఆమెని చూడడంతో ప్రకాశరావు మొహంతెల్లనయింది. ఆమె మాట్లాడకముందే, అతను కోపంతో "మాట్లాడుతున్నాను కనపడ్డంలేదూ? బైట కూచోండి, వొస్తాను." అని, ఇంగ్లీషులో తన సంగతే ఆ రెండో ఆయనతో చెపుతున్నాడు. ఏదో అబద్ధమై వుంటుంది. తను లోపలికి రావడం తప్పుగావును! తనకేం తెలుసు!

ఏమీ అనలేక బైటికి వెళ్ళింది. బైట రెండు బల్లలున్నాయి. వాటిమీద కూచుంది. రోడ్డుమీది వాళ్ళందరికీ కనపడుతోంది. అందరూ తననే చూస్తున్నారు, తనెంత రహస్యంగా రావాలనుకుందో, అంత బట్టబైలయింది. రాగానే ప్రకాశరావు తనని కావిలించుకుంటాడనే గంపె డాశతో, విడువలకాగానే పరిగెత్తుకొచ్చింది. ఇట్లా చేశాడు. యింత దుర్మార్గుడా ? కాదు, దుర్మార్గుడుకాదేమో ! ఆ కొత్తమనిషి యెవరో వుండబట్టి అట్లా చేశాడు. అంతేగాని తన నంత దయగా ప్రేమగా లాలించే ప్రకాశరావు మారిపోతాడా ? ఇంకా ఆ కొత్తఆయన యెప్పుడు వెడతాడు ? గంటయింది. అప్పుడప్పుడు వాళ్ళుమాట్లాడే వ్యవహారం మాటలు ఆమె చెవుల్లో పడుతున్నాయి.

ఆయనెవరో వెళ్ళగానే తనను యెంత ఆదరంగా చూస్తాడో ! తను అతని యింటోనే యెంత సుఖంగా వుండవొచ్చో ఆలోచించుకుంటోంది. కిటికీలోంచి ఆకొత్తాయన బూడ్సులు కనపడుతున్నాయి. అవి యెంతసేపటికీ కదలవు. అప్పుడప్పుడు మాట్లాడకండా కూచుంటాడు. వెళ్ళడు మాట్లాడినప్పుడు ముగించే విధంగా మాటలు వినపడవు. తనని కలుసు కోవాలనే ఆతృతతో ప్రకాశరావు "సరేలెండి, తకిండ్కి రేపు మాట్లాడుదాము" అని ఆయన్ని పంపేస్తాడనుకుంది. కాని ప్రకాశరావే కావలసి ఆయన్ని కబుర్లలోకి దింపి ఆపుతున్నట్టు కూడా తోచింది.

చివరికి చైర్మనుగారు లేచారు. ఆయన్ని పంపేందుకు ప్రకాశరావు వరండాలోకి వొచ్చాడు. ఆయన వెళ్ళగానే డాక్టరు అనసూయవేపు తిరిగి

"ఇదేమిటి యిప్పుడొచ్చావిట్లా ?" అన్నాడు. కంఠంలో కోపం వినపడుతోంది.

"లోపలికిరా" అని ఆమెని తన మందుల గదిలోకి తీసికెళ్ళాడు. వెంటనే ఆమె తన చేతుల్ని అతని మెడచుట్టూ వేసి మొహంకేసి చూసింది. ఆమె మొహాన్ని దగ్గిరిగా వొంచి ముద్దు పెట్టుకున్నాడు. ఆమె అతనిమెడ వొదలక పెదవుల్ని దగ్గిరిగా తీసుకోడంచూసి అతనికి

భయంకలిగింది, మెల్లిగా వొదిలించుకుని

"ఏమిటి, తొందరగా చెప్పు" అన్నాడు.

"కనుకున్నతరవాత వూరుకుంటా రనుకున్నామా, నన్ను గదిలోవేసి చాలా యేడిపించారు, నిన్నరాత్రి మామామ.........పరిగెత్తు కొచ్చాను. యింక నేను యింటికి వెళ్ళను."

"వెళ్ళక!" అతని కంఠస్వరంలోని అనుమానం విని అనుసూయకి భయంకలిగింది,

"ఇక్కడేవుంటాను. ఎక్కడైనా వుంటాను"

"ఇంటిదగ్గిర్నించి రావడం మంచిపనేనా? నుదురు ముడుతలు పడ్డది. కళ్ళలో కోపం కనపడుతోంది.

"ఎట్లా వుండను ఆయింటో? నన్నేంచేశారంటే...."

ఎట్లాగో మారిపోయినాడు యీ మూడురోజుల్లో. అంతా అతనితో చెప్పేద్దా మనుకుంది. చెప్పడానికి అనుకున్న మాటలేవీ రావడంలేదు.

"చూడండి. మూడురాత్రులు కనపడకపోతే యేమను కున్నారు? వూరంతా గోలయింది, మీకు తెలీలా?"

తెలిసిందని తలవూయించాడు.

"మీరేం చెయ్యలేదేం?"

"ఏం చెయ్యను?"

"నాకేం తెలుస్తుంది? మీకు తెలియాలి! యేమేమిటో అనుకున్నాను. వాళ్ళని ఖైదు చేయిస్తారనీ, నన్ను తీసుకు వెడతారనీ యేమేమిటో అనుకున్నాను...........పోనీలెండి. అవంతా అయిపోయింది. తప్పించుకు వొచ్చేశాను. యీ మూడురోజులూ మిమ్మల్ని చూడాలనే యెప్పుడుచూస్తానా అనే! మళ్ళి యీ వాళ రాత్రి — మళ్ళీ — యింక వొదిలిపెట్టను కదా—యింక యెప్పుడూ........"

అతన్ని చాలా ప్రేమతో తాకింది. యీప్రేమనిచూసి అతని మొహంలో కలిగేమార్పు అనుసూయ గుండెల్లో భీతి పుట్టించింది. అతను

మాట్లాడితే విన్నాలని ఆగింది.

"అసలు యింటిదగ్గిర్నించి రావడం చాలా తప్పు. యిప్పుడేమై పోతావు? నాకు కబురుపంపించి వుండవలసింది"

"మీదగ్గిర వుంటాను."

"నాదగ్గిరా!"

"అవును."

"ఇక్కడెట్లా వీలవుతుంది? నువ్వు నాకెవరని యిక్కడ వుంచను?"

అనుసూయకి తెలిసింది.

"వుణ్ణీండి. నేను వెళ్ళను, యెక్కడికి వెళ్ళను?"

"ఇంటికి వెళ్ళాలి. మళ్ళీ వాళ్ళనుమానపడకముందే వెళ్ళాలి, నీశ్రేయస్సుకోరే చెపుతున్నాను, వొచ్చే కష్టాలు నీకర్థంకావు. చిన్నదానివి."

"నన్ను మళ్ళీ మీదగ్గిరికి రానీరు."

"పోనీ!"

ప్రకాశరావు తననించి ఇట్లా విముఖుడు కావడం అనుసూయకి ఏమాత్రం అర్థంకాలేదు. మర్యాదస్తులైన మొగవాళ్ళని పాలించే మాలిన్యాలూ, స్వార్థాలూ ఆమెకింకా తెలీవు, తనేదో తప్పుచేశాననీ, తల్లి యిల్లు వొదలడం అతను ఎందుకో అంగీకరించడంలేదనీ, ఆమె మనసు వెనక ఆలోచించుకుంటోంది. తనని ప్రోత్సహించిన ఆనందానికి; రొమాన్సుకి తన సర్వస్వాన్ని వప్పగించి, వెనుకముందులు చూడకుండా ముందుకి దూకిన అనుసూయకి పాపం యీ అనుభవం భయంకరమైన కలమల్లేవుంది.

"ఎట్లా!" అంది, ఏం తోచక,

"ఎంతకాలం వొచ్చేదానివి? నాకు 'ట్రాన్స్ఫరు' అయితే యేం చేసేదానివి?"

"మిమ్మల్ని చూడకండానా! నేనుండలేను, మిమ్మల్ని ప్రేమించాను. చూడకండా బతకలేను. నేనువెళ్ళను."

"ఇట్లా కాదు, నేనూ నిన్ను ప్రేమించాను కాని నాలుగు రాత్రులు గడిపితే—యెల్లకాలమూ వీలవుతుందా? ఆలోచించుకో, నీబంధువులూ, సంసారమూ అన్నీ వొదిలి యిట్లా వొచ్చేసి యేమైపోదామని? నామాట విని వెంటనే వెళ్ళు."

"నన్ను ప్రేమించినవిధం—ఆస్పత్రిలో మీరు, నేను—మీదాన్ని. నన్నే ప్రేమిస్తున్నానని. ఆమాటలని........"

"ఆసమయం అన్నవన్నీ నిజంగా వేదవాక్యాలుగా పట్టుకుంటావా? నువ్వింకా చిన్నదానివి నామాట విను."

"అయితే నేను మీకక్కర్లేదూ?"

"కావాలి. కాని యిట్లా యింటిదగ్గిర్నించి వొచ్చి; నాతోవుంటే నన్ను పాడుచేస్తావు. నువ్వుపాడవుతావు. అందుకని చెపుతున్నాను."

"మిమ్మల్ని చూడడానికి వీలుండదుగా?

"అదే మంచిది."

"అంతేనా! మిమ్మన్నెంత నమ్మానండి! యెంత ప్రేమించానండి!"

లోపల్నించి డాక్టర్ని యెవరో పిలుస్తున్నారు,

"నేనేమైపోవాలి? యేమైనాసరే యింటికి వెళ్ళను, యేంకాను?"

"మీ యింటిదగ్గిర దిగపెడతాను రా."

ఎవరో తలుపు కొడుతున్నారు.

"వొస్తున్నాను, యింటోకి వెళ్ళు" అన్నాడు డాక్టరు ఆ బైట వారితో

యింకా లాభంలేదనుకుంది, డాక్టరు చెయ్యిపట్టుకుని బైటికి తీసికెడుతోవుంటే మాట్లాడకండా యేడుస్తోవొచ్చింది. వరండాలో ఒకసారి మళ్ళా డాక్టరు మొహంకేసి చూసింది. రాత్రికేసి చూసింది,

వీధిలో యెవరూ తిరగటంలేదు, "ఇంతేనండీ" అని మూలుగుతో యేస్చి వీధులోకెళ్ళి "ఇంక నన్ను చూడరు. సుఖంగా బతకండి" అని వెళ్ళిపోయింది.

అనుసూయ వెళ్ళగానే డాక్టరు విచారంతో స్తంభంపట్టుకుని నుంచున్నాడు, ఒకనిమషం.

"ఆమె యెవరండీ? యీ అర్థరాత్రి అట్లాపంపించేశారు" అన్నారు చీకట్లో మూలనున్న ఆయన బల్లమీదనించి. ప్రకాశరావు అదిరిపడి-ఎవరు వారన్నాడు.

"నేనండీ, సూరయ్యని"

ప్రకాశరావు సూరయ్యని రాత్రి పడుకోడానికి రమ్మన్న సంగతి మరిచిపోయినాడు, ఆయన పక్కన పల్లెటూరినించి మందు పుచ్చుకోడానికి వొచ్చిన కమ్మాయన. భాగ్యవంతుడు. కనక ప్రకాశరావు ఆయనకి చాలా మర్యాదచేస్తున్నాడు. అతడు తనని ఆసయంలో చూసినందుకు అనుసూయమీద కోపమొచ్చింది.

"నాదగ్గిరికి మందుకొచ్చేదిలెండి. మంచిరకంకాదు. యింటో తగాదాపడి యిక్కడికి వొచ్చి నన్ను యెక్కడన్నా వుండడానికి స్తలం చూపమంటుంది. నేనేంచెయ్యను; వెళ్ళమంటే యేడుస్తుంది."

"పాపం యిప్పుడేమవుతుందో?"

"ఇంటికి పోతుంది. మనకెందుకులెండి. బైటకూచున్నారేం, చీకట్లో? పక్కేమన్నా యిస్తానుండండి" అని లోపలికి వెళ్ళిపోయినాడు."

సూరయ్యకి అరవైయేళ్ళుదగ్గిరిగావొచ్చినా 'రొమాన్సు' చావలేదు, జాలి యెండిపోలేదు. అనుసూయవంక చీకట్లో చూసినప్పుడే ఆమె లేత దృఢమైన నడుంవొంపు, చంపల కోలతనమూ కనపడ్డది. అనేక స్త్రీ సౌందర్యాలని చూసిన అతనికళ్ళకి, వాటి అనుభవమిచ్చే సౌఖ్యమూ ఆమె కంఠంలోవుండే 'పాషన్'తెలిసింది. వెంటనే లేచి చీకట్లో ఆమెని వెతుక్కోంటో బైలుదేరాడు. ఇట్లాంటి నిశీధ అన్వేషణాలవల్లనే తనకి

యీ ఆస్పత్రికి చేరేగతిపట్టిన సంగతి మరిచాడు.

దిగులుతో మెల్లిగా నడిచే అనుసూయవెంటనే దూరంగా నడుస్తున్నాడు. ఆమె యిళ్ళనీడలలో నడుస్తో వూరిబైట కాలవదగ్గరికి పోయింది. నీటిదగ్గిరిగా నుంచుని కొంచెంసేపు యేదో ఆలోచించి, చుట్టూ చూచింది. కూచుంది. ఏమాలోచిస్తోందో మెల్లిగా యేడుపు ప్రారంభించింది. కాలవ అవతల వొడ్డున గానుగచెట్లలో మిణుగురు పురుగులు ఆడుతున్నాయి. నీటిలో నక్షత్రాలు మెరుస్తున్నాయి. ఆమె యెక్కిళ్ళుతప్ప యింకేమి శబ్దంలేదు. సూరయ్య హృదయం తపించింది. ఆ ఏడుపులోని అమాయకత్వం, నిరాశా, బోధపడుతున్నాయి. యవ్వనానందంతో నిలవలేక. అనాలోచనగా, కనపడ్డ పురుషుణ్ణి నమ్మినశించిన కన్యల హృదయవేదనంతా వినవొచ్చింది. అతనికి ఆరాత్రి! అనుభవించిన పురుషుడు చెక్కుచెదరక వృద్ధిపొందడమూ, వాడునలిపి వాసనచూసి పారేసిన యీ చిన్ని పూలిట్లా వాడిపోవడమూ, సంఘం నిరాదరణా, నిర్దయా, మృత్యువు తప్ప యింకో ఆహ్వానం లేకపోవడమూ, అన్నీ దూరంగా తోచాయి అతని మనస్సుకి. 'బ్రతే' అయన స్త్రీకన్న ఘోరమింకోటి ప్రపంచంలోలేదు.

వెనకనే వెళ్ళి 'తల్లీ అన్నాడు.'

ఆమె గబాలున నీళ్ళలోపడ్డది.

సూరయ్య ప్రాణాలు ఎగిరిపోయినాయి. అతనికి యీతరాదు. కాని ఆలోచించలేదు. దూకాడు. ఎండాకాలం కావడంచేత కాలవ లోతులేదు. అతనికి కంఠంవరకు నీళ్ళొచ్చాయి. చుట్టూ చూశాడు. జాడలేదు. నీళ్ళఅలలూ, అలలమీదచెదిరే నక్షత్రరేఖలూ తప్ప. సగం మునిగి యిటూ అటూ వెతికాడు కనపళ్ళేదు. ఎంతసేపయిందో! విచారంతో భయంతో చుట్టూ చూస్తున్నాడు. మెల్లిగా పీచులాగా వెంటికలు కనపడ్డాయి. తాకడం భయంవేసింది. బతికివున్న తలమీది వెంటికలు ముద్దు పెట్టుకుంటాము. వేళ్ళతో ఆడుకుంటాము. కాని

మరిణించగానే నీళ్ళలో చీకట్లో తేలివొచ్చే వెంటికల్ని చూస్తే భయం అనుకున్నాడు. చప్పున పట్టుకుని పైకిలాగి, మనిషిని వొడ్డుకుతెచ్చాడు. ప్రాణం కనపళ్ళేదు. సంఘం బలితీసుకున్న ఆ బాలిక వంక చూస్తో నుంచున్నాడు, సూరయ్య. ఆకాశాన నక్షత్రాలు మెరుస్తున్నాయి మిణుగురుపురుగులు గానుగచెట్లలో ఆడుకుంటున్నాయి. నీళ్ళు మళ్ళీ కుదటపడ్డాయి. లోకం మామూలుగా నిద్రపోతోంది, అనుసూయ కదలకుండా పడివుంది, యీ కామాలకు, యీ క్షోభలకు; పెంపుళ్ళకు, మామయ్యకూ; నిందలకు, నవ్వులకూ, యీర్ష్యలకూ, అతీతురాలై.

# వేదాంతం

"సత్తిరాజు అనే వోవర్సీరు ఆత్మహత్య చేసుకున్నాడు. పోలీసు విచారణ జరుగుతోంది'

అని పేపర్లో చదివాను. పదిహేనేళ్ళ కిందట విక్టోరియా హాస్టల్లో నాకు నాలుగుగదుల అవతల గదిలోవున్న సత్తిరాజేనేమో! ఆరోజుల్లో ఆ సత్తిరాజుకి నామీద నిష్కారణ గౌరవం. తక్కినవాళ్ళు నన్ను ద్వేషించడానికి అనేక న్యాయమైన కారణాలున్నాయి కాని, యితని గౌరవించడానికి ఒక్కటీ లేదు, నాతో చనువు చేసుకోవాలని చాలా ప్రయత్నించాడు. కాని, నా కతనిమీద ప్రత్యేకమైన ప్రేమ రాలేదు. మొదటినించీ నాకు స్నేహితులమీద ప్రేమ వుండేదికాదు. ఇప్పుడూ అంతే. పురుషుడికి నా హృదయంలో చోటులేదనుకుంటాను. కాని, సత్తిరాజు దృష్టి ఎప్పుడూ నన్ను వెంబడిస్తో వుండేది, అతనే నేమో యీ ఆత్మహత్య చేసుకుంది? ఎందుకో? నా దుర్భర జీవితాన్ని తలుచుకుని, కొంచెం యీర్ష్యకూడా పొందాను.

గంట కొట్టింది. పత్రికని నక్కలాగు కాచుకుకూచున్న రంగనాథం ముందుపారేసి క్లాసులోకి వెళ్ళాను, కాని, ఆ ఆత్మహత్య నా జీవితాన్నెంత తారుమారు చెయ్యబోతుందో నాకు తెలీదుకదా!

మర్నాడు రాజమండ్రి పోలీసుయిన్స్పెక్టరు దగ్గిర్నించి వుత్తరం వొచ్చింది.

'ఆత్మహత్య చేసుకున్న సత్తిరాజుగారు. తన కడపటివుత్తరంలో మీవొక్కరిమీదనే తనకు సంపూర్ణమైన విశ్వాస ముందనీ, మీ సహాయ మపేక్షించమనీ వ్రాశారు. ఆయన కుటుంబపరిస్థితులు క్లిష్టంగా వున్నాయి ఒకసారి రాగలిగితే సంతోషిస్తాము.'

ఇంకేం అతడే యీ సత్తిరాజు! కాని, పదిహేనేళ్ళలో ఒక్కసారి కలుసుకోకపోయినా నన్ను జ్ఞాపకం వుంచుకోడమేమిటి? వున్న గోలలు చాలవూ? ఇదికూడా నానెత్తిన యెందుకు? వెళ్ళకూడదనుకున్నాను. వెళ్ళాను. చచ్చినవాళ్ళదైనా సరే, పరులిచ్చే గౌరవానికి లొంగిపోని వాడెవడు?

ముందు యిన్‌స్పెక్టర్ని చూచాను.

'మీరు సత్తిరాజుగార్ని బాగా యెరుగుదు రనుకుంటాను. బంధువులా?'—

—చెప్పాను.

'చిత్రమే! పదిహేనేళ్ళు కలుసుకోనేలేదా?'

'తలుచుకో నన్నాలేదు.'

'సత్తిరాజుగారి చావుకి కారణం తెలీదుకాదా మీకు?'

'చచ్చాడనే తెలీదు పత్రికల్లో పడ్డదాకా'

'ఆయన ఒక మలబారు టీచర్ని ప్రేమించాడు, కొంతకాలం తరవాత ఆమె యీయన్ని వొదిలి, ఇంకో గొప్ప వుద్యోగస్తుణ్ణి చనువు చేసుకుంది, ఆయనకోసమే యీన్యూస్, పేపర్లలో సప్రైస్ చేశాము. సత్తిరాజుగారు భరించలేక ప్రాణాలు అర్పించుకున్నారు. ఆయన కడపటి వుత్తరం యిదీ.'

అది చాలా పెద్దవుత్తరం, ఆ వుత్తరంలో అంతా ఆయన భార్య సంగతేగాని, ఆ మలబారు ఆమె సంగతి ఒకరేముకరేలేదు—నాకు సంబంధించిన భాగం-

'నాకు దగ్గిర బంధువులూ, నాకోసం విచారపడేవారూ, శ్రమపడే

వారూ ఎవరూలేరు, నా భార్య విచిత్రమైన వ్యక్తి. 'రాక్షసి' అనిపూర్తిగా నిశ్చయించలేను. ఆమె హృదయానికి బదులు రాయివుంది. రక్తం బదులు పాదరసంవుంది. ఆమే కనికరిస్తే-నాగతి యిట్లా కాకపోను. నాకు పిల్లలులేరు. కాని, దిక్కులేని నా మేనల్లుడు నా పాలపడ్డాడు, వాడిగతి ఏమికానున్నదో అనే నాచింత. వాణ్ణి నాభార్య దాక్షిణ్యంలో వొదలడం నాకు ఇష్టంలేదు. కనక నా స్నేహితులలో గుంటూరులో టీచరుగావున్న-'

అని నన్ను పొగిడి, నామీద భారం పారేసి చకారి పోయినాడు. నేను గుంటూరులోవున్న సంగతి ఎట్లా తెలుసో! నాకెందుకో ఈగోల! ఇదంతా నామీద Practical joke కాదుకద! అడగడానికీ వొద్దనడానికీ ఆమనిషి యేడీ! చావుతో యిట్లా బాధ్యతల్ని తప్పించుకుపోవడం చాలా అన్యాయం ఆలోకంలో ఏదన్నా Supreme Court వుండితీరాలి, ఇట్లాంటి వ్యవహారాలకు.

'నేను చెయ్యవలిసింది ఏమీ కనపడదు, నేనేంచెయ్యగలను?'

'వొచ్చిన చికేరిమిటంటే, ఆమేనల్లుడిసంగతి'

'నేను పెంచాలా? ఆమె ఏంచేస్తుంది?'

'ఆమెతో మాట్లాడి చూడండి.'

'ఆమెతోనా. ఎందుకు?___'

అన్నాను కాని వెళ్ళాను. ఆమెని సత్తిరాజు అట్లా తిట్టకపోతే, వెళ్ళేవాణ్ణి కా ననుకుంటాను.

* * *

ఆ మలబారు స్త్రీ ఎవరో ఏమయిందో తెలీదు. భార్యేమిగిలింది.

ఎండ మీదికి వచ్చినా లేవక, కుకరిలు నిద్రపోతున్నాయి. గోదావరి నీళ్ళలోంచి బడబాగ్నివలె సూర్యకాంతి కళ్ళని కాలుస్తోంది. గాలికికూడా భయంగావుంది కదలడానికి. నది గట్టుకిందవున్న చిన్న మిద్దెమీదికి కాలుతున్న మెట్లెకిరివెళ్ళి తలుపుకొట్టాను. నే నేదో సత్తిరాజుకి గొప్ప మిత్రుణ్ణి అని యేడిస్తే! నాకు ఆడవాళ్ళని వోదార్చ

దం, కుశలప్రశ్నలూ చాతకావే!

'ఎవరు ?' అంది లోపల్నించి విసుకుతో.

'తలుపు తియ్యండి.'

కుర్రాడు ఒకడు తలుపు తీశాడు.

ఆమె మంచంమీద కూచుని వ్రాసుకుంటోంది. తలెత్తి,

'అట్లా కూచోండి' అని మళ్ళీ వ్రాసుకుంటోంది.

'యిదేనా యిల్లు ?'

'ఎవరు ?' అంది తలెత్తకండానే.

'ఇదేనా సత్తిరాజుగారి యిల్లు ?'

'ఊఁ'

'మీరు ?'

'భార్యని. మీరు ?'

తెలియచేశాను, నేనెవరో, ఎందుకు వొచ్చానో.

మాట్లాడుతోనే ఆమెని పరీక్షచేస్తున్నాను, నా అంత పొడుగు వుంటుంది, సన్నని వొళ్లు, ముప్ఫైఐదేళ్ళకి తక్కువ వుండవు. కొన్ని వెంట్రికలు నెరిశాయి. మూతిదగ్గిర్నించి ముక్కుదగ్గిరికి రెండు ముడతలున్నాయి. ఆమెలో యేమీ రాక్షసత్వం కనపళ్ళేదు, దేవత్వమూ లేదు. నన్ను నిర్లక్ష్యం చెయ్యడమూ, విషాదచిహ్నాలేమీ లేకపోవడమూ-అవేవింతలు. పావుగంట కూచున్నాను. మాటలులేవు. వింతగావుంది. వ్రాయడం అయిపోయి, దారంతీసి చికురు తీస్తోంది. .... నేనే మాటలు ప్రారంభించాలి.

'ఈతనేనా మేనల్లుడు?'

'అవును. మీరింత శ్రద్ధతో యింతదూరంవొచ్చారు. ఎంతో దయతో.' అంది ప్రయత్నపూర్వకంగా, అయిష్టమైన Duty చేస్తున్నట్టు

'నేనేం చెయ్యగలను ?'

'ఏమున్నది ? ఏమీలేదు. మళ్ళీ రైలెప్పుడు ?'

'మరి యీఅబ్బాయి సంగతి ?'

'మీరుతీసుకు వెడతారా ?'

మీ అభ్యంతరం ఏమిటి అతన్ని వుంచుకోడానికి ?'

'ఏమీలేదు. కాని నాకు అవసరమూలేదు. నేనూ ప్రత్యేకం అతనికీ అవసరంలేదు—'

'ఏదో గూఢంగా మాట్లాతున్నారు.'

'అనుకున్నాను, స్పష్టంగా, హృదయంలో వున్నదున్నట్టు మాట్లాడితే, ప్రపంచానికి అర్థంకాదు. స్వచ్ఛమైన ఆలోచనికి రంగులు కల్పిస్తేనేగాని, చూడగల ప్రజ్ఞపోయింది మనుష్యులకి. నాకూ, అతనికీ ప్రేమబంధం ఏమీలేదు. అందువల్ల పరస్పరంగా భారమైనాము, ఇప్పుడన్నా తెలిసిందా ?'

'బంధువులు లేరా ?'

'పిల్లవాడికి కావలసినవాళ్ళులేరు, అసలే పిల్లలు ప్రపంచానికి యెక్కువైనారు, సత్తిరాజుగారు ఇతన్ని చాలా గారాబంగా పెంచారు. దయలేని వాళ్ళకి వప్పచెప్పడం చాలాకూౄరం. ఆయనికి మీమీద గొప్ప విశ్వాసం.'

'ఏమీకారణం లేదు—'

'నాకు అట్లానే తోస్తోంది.'

విచిత్రమైనమాటలు. నామనసు చివుకుహమన్నది. నాకోపం గుచ్చుకునేందుకు—

'వుత్తరంలో మిమ్మల్ని దూషించడానికికూడా కారణం వుందనుకుంటాను.

'ఉండకేం ?'

ఎట్లా యీమెని నొప్పించడం ?

'మిమ్మల్ని యేమన్నాడో చదివారా ?'

'లేదు. కాని వూహించుకోగలను.'

'రాక్షసి....'

నావంక నిదానంగా కళ్ళెత్తిచూసింది. ఆమెలో ఏమీ అందం లేదు, ఆమెకళ్లు ఏమీ అసాధారణమైనవి కావు. కాని, ఆచూపు___ ఎన్నడూ నా అనుభవాని కందని అవ్యక్తమైన కలవరం కలిగించింది. విస్మయమో, భయమో, గౌరవమో, కోపమో, అన్నీనో నాలోపలికి గుచ్చిచూసి, ఏదో తెలుసుకుని సంతుష్టి చెందినట్టు. కళ్లు చేతిలోని దారంమీదికి ప్రయత్నపూర్వకంగా వాల్చింది. నా కోపం పోలేదు ఇంకా. అనాధఐన అవినీతురాలైన స్త్రీ చేతిలో- మొగవాడు అపజయాన్ని అంగీకరించడం ఎంతకష్టం?

'అతని చావుకి మీరు కారణ మన్నాడు.' అని ఇంకా గుచ్చాను.

ఏమాత్రమూ చలించలేదు.

'రక్షించకలిగి వుందునని ఆయన అభిప్రాయం.'

'శక్తి వుండికూడా వుపేక్షించారా? నేను నమ్మను!'

'పోతలిచినవారిని అడ్డుపెట్టడం ఏంమర్యాద!'

__హడిలిపోయినాను.

'అంత కోపమా?'

'లేదు'

'మరి___'

అలోచించింది.

'ఏం లేదు. పోనీండి.

'మీకు అర్థంకాదు' అన్నట్టు వినబడ్డాయి ఆ మాటలు. నాకు కంఠంలో అప్రయత్నంగా, కళ్ళలో ఇందాక కనపడ్డ అద్భుత ప్రింపచాలే వినపడ్డాయి ఒకొరొకరి మాటలో.

విచిత్ర వ్యక్తి!

నేనువొంటరిని, రోగిని. ఆ సంగతి సత్తిరాజుగారికి తెలీచను కుంటాను.' అన్నాను.

'పోనీండి. యిబ్బందిలేదు.'

'ఇంకే విధంగా నన్నా నేను....'

'ఏముంది? ఏమీలేదు.'

'నేను వెళ్ళేముందు మళ్ళీవొచ్చి చూస్తాను.'

తల వూగించింది. కాని. అవసరం లేదు అన్న మాట తెలుస్తోనేవుంది.

* * *

రాత్రి పదకొండింటికి రైలెక్కాలని నిశ్చయం చేసుకుని నలుగురైదుగురు స్నేహితుల్ని చూశాను. ప్రతివారూ ఆమె సంగతి మాట్లాడారు. అందరూ ఆమెసంగతి విన్నవారే గాని, స్వయంగా తెలిసినవా రెవరూ లేరు.

"విచిత్రమైన మనిషిరా! ఒకామె పిల్లపోయి యేడుస్తోవుంటే–

'కొట్టేందుకు ఇంక యెవరూ లేరనా యేడుస్తున్నావు? అందిట" అని చెప్పారు ఒకరు,

ఇంకోరు–'అది ఆడదిరా! రాక్షసి!!–

"బాపనీడు భార్య వోదార్చడానికి పోతే 'నీపెనిమిటి పోయినప్పుడు వొస్తానని ఆశా!' అంది"అని యింకోడు.

'దీంతో పడలేకే ఆ మలబారుదాంతో తంటాలు పడ్డాడు సత్తిరాజు. ఇదే చంపింది వాణ్ణి తెలుసునా? సత్తిరాజు శవాన్ని పోలీసువాళ్లు దహనం చేశారు. తనకేమీ సంబంధం లేదు పొమ్మందిట.' అని మరివొకడూ.

సత్తిరాజుని చూస్తే అందరికీ గౌరవమూ, ప్రేమా, అతని విపరీత మోహానికిగాని, యీర్ష్యకిగాని ఒకరూ నిందించలేదు అతన్ని.

* * *

రాత్రివెళ్ళి మెట్లదగ్గిర తలుపుమీద చెయ్యి వెయ్యగానే, తెరచువుంది. కుర్రాడు నిద్రపోతున్నాడు. హాలులో ఏవరూలేరు. పకగదిలో

దీప ముంది. పిలవబోతోవుండగా మాటలు వినపడ్డాయి, ఒకటి _మొగ కంఠం. ఇదా యీమెకి విచారం లేకపోవడానికి కారణం? అతని మృత్యువు వాస్తవరూపం యిదీ! ఇందుకా యీ కుర్రవాణ్ణి వొదుల్చుకోడం! స్పష్టమయింది.

'ఐదువందలా? ఇయ్యను? అంది ఆమె.

'సరే. ఆలోచించుకో, రేపు సాయింత్రిందాకా' అన్నాడు మొగవాడు.

'జైలంటే భయంలేదు నాకు. ఈ జీవితమే ఖైదు.'

'అంతతో ఆగదు.'

'మరీ మంచిది.'

'అదికూడా కాదు. ఆడదానివి.'

'అంతే కద!'

చప్పున యిద్దరూ బైటికి వొచ్చి, నన్ను చూశారు. ఆమె యెప్పటివలెనే, నానించి కళ్ళు కిందికి వాల్చి, ఆలోచనలో పడ్డది. ఆయన నన్ను చూసి భయపడ్డాడు.

'ఎవరు?'

—చెప్పాను, వెళ్ళిపోయినాడు.

'కూచోండి.'

'ఈ రాత్రి ప్రియాణం.'

'విన్నారు. అవునా?'

'చివరి భాగం'

దుప్పటిమీది గీతలవెంబడి వేళ్ల పోనిస్తో కూచుంది. ముఖంలో కొంచెం బాధ. కోపమూ కనపడుతున్నాయి,

'నాకా విషయం తెలీదుగాని, నా సహాయంవల్ల లాభంవుంటే—, ప్రియాణం తొందరలేదు.'

'మొగసహాయంలేని ఆడది ప్రిపంచానికి ఎంత చులకన! అల్లు

కోని తీగెనివలె కాళ్లకింద తొక్కుతారు.'

'కొన్ని తీగెలకి ముళ్లుంటాయని తెలీదు వాళ్ళకి.'

కొంచెంగా నవ్వింది, నా insult ని లెఖ్ఖచెయ్యక.

'మొగవాళ్ళు బూడ్సులు వేసుకుంటారు। చేతులో కర్రలుంటాయి.'

'నేను బూడ్సులూ, కర్రిలూ గోదావరిలో పారేసి వొచ్చాను.'

'సత్తిరాజుగారిమీది గౌరవం వల్ల.'

'కాదు, మిమ్మల్ని చూశాక.'

'నాకు అందం లేదు.'

'అవును మీ శరీరానికి'

'అంతే ప్రపంచం చూడగలిగింది'

'ప్రపంచంలో అందరూ వొకటి కాదు.'

'మిమ్మల్ని తప్పు అభిప్రాయ పడ్డాను, మొదట్లో'

'ఏమో చెప్పలేము.'

'ఆయన పోలీసు సబిన్‌స్పెక్టరు., ఐదువందలు లంచ మివ్వక పోతే—సత్తిరాజుగారి వ్యవహారంలో నన్ను అరెస్టు చేయిస్తాట్ట.'

'వాడిమొహం. ఇన్‌స్పెక్టరుతో మాట్లాడతాను, సూపరెంటునే చూస్తాను,'

-వూరుకుంది.

-భయపడదేం ?

'నిజంగా అరెస్టుచేస్తే. ఎట్లా అనదేం?' అని గోలపెట్టింది నా పురుష హృదయం.

వొప్పుకుంది గావును. నేను వుండిపోవాలి ఆవూళ్ళో ; వీళ్ళం వర్ని చూడాలి. ఇంకా యేం చిక్కులు వున్నాయో ; ఈమెమీద యేం అనుమానాలు వున్నాయో। నా కెందుకీ గోల ? నా ఆలోచనల్ని గ్రహించిందేమో।

'మీరు వెళ్ళండి భయంలేదు.'

'మరి మీరు ?.........ఎవరూ స్నేహితులు లేరా ?'

'లేరు'

'ఎందుకు ? మీకేం తోస్తోంది ? ఏం చేస్తారు పొద్దస్తమానం ?'

'ఏమీచెయ్యను. అట్లా చూస్తో కూచుంటాను.'

'వంట ?'

'హోటలు.'

'ఎందుకు ఏమీ చెయ్యరు ?'

'తిండికి లేకపోతే పని చెయ్యవలసి వొచ్చేది. ఆ బాధ లేదు. ఇంకేం పనివుంది ?'

'స్నేహితులు'

'ఎవరూ స్నేహంచెయ్యరు నాతో.'

'చదువుకోడం'

'కొంచెం చదువుతాను. కాని, కొత్త సంగతులు వుండవు. పుస్తకాల్లో !—

'కథలు, చరిత్ర, వ్యాసాలు, పురాణాలు, అన్నీ తగూలూ, పిల్లల్ని కనడమూ, చావడమూ, ఏది చూసినా అంతే—ఎందుకు చవవడమూ — అర్థంలేని నీతులూ, వేదాంతం?,

'మరి అందరూ పనులు చెయ్యటం లేదా ?'

'అదే నా ఆశ్చర్యం'

'పనిచెయ్యక వూరికే తిని కూచోడం స్వార్థం, సోమరితనం.'

'అంతకన్న యేం చెయ్యాలి ? వీళ్ళేం చేస్తున్నారు ? క్లబ్బు, టెన్నిస్, పేకాటా, కబుర్లూ, ఇవన్నీ....'

'మరి వుద్యోగాలూ.'

'పోలీసులూ. టీచర్లూ, లాయర్లూ, వీళ్ళందరూ, ఏం వుపయోగం — తిండిలేక చేస్తారు. పరోపకారమా ?'

'తిండికై చేసినా, వుపకారమేగా !'

'కాదు. ఈ వుద్యోగస్తులు చేసే అపకారం ఎవరూ చెయ్యరు.'

'టీచర్లూ, డాక్టర్లూ-'

'వాళ్లూ అంతే'

'పోనీ, మీరేదన్నా కుట్టూ అవీ చేసి, సంపాయించరాదా ?'

'ఎందుకు సంపాయించడం ?'

'ఇతరులకి యియ్యడానికి'

'ఎందుకు యివ్వడం ?'

'వాళ్ళ సహాయానికి'

'ఎందుకు సహాయం చెయ్యడం ?'

'మీరు ఆపదలో వుంటే ఎవరన్నా సహాయం చెయ్యావొద్దా !'

'నాకు అపాయమా ? ఏమి అపాయం ? తిండే లేకపోతే, జబ్బుచేస్తే; మనుషులు, కుకరాలు, ఒకసారి సహాయంచేశామా యింక వొదలరు. కొంచె మిచ్చామా, యింక యీ కాముకుల మోస్తరే ! నాకు సహాయమా ? అఖర్లేదు. భరించలేకపోతే, ద్వారం తెరిచే వుంది కాని, నిజంగా సహాయం-యీ వొంటరి తనానికి స్నేహం, మృత్యుబాధకి పునర్జీవితం యిస్తే-సహాయం. నేను ప్రేమించుకునేందుకు బిడ్డ నివ్వ గలరా, ఆబిడ్డ చస్తే ప్రాణమివ్వగలరా ? ఇంక సహాయ మేమిటి ? ఏ సహాయమూ అఖ్కర్లేదు.'

'మీకెందుకు స్నేహితులు వుండకూడదూ ? ఒకరూరారే !'

ఆమె కళ్ళలో నీళ్ళు మెరిశాయి,

'నాజన్మ అట్లాంటిది !'

'పాట, చిత్రలేఖనం'

'ఎందు కవన్నీ ! పిల్లల ఆటలు. ఇట్లా బాగా వుంది.'

'మరి యీ వంటరితనంవల్ల బాధధ్వనిస్తోంది మీకంఠంలో.'

లేచి నా పక్కన వొచ్చి కూచుంది. అంత రాత్రి వొంటరిగా

మొగాడితో మాట్లాడుతున్నా ననే సంకోచమే లేదు. తలుపు అట్లా వోరగా తీసేవుంది.

'స్త్రీలైనా రారే!'

మాట్లాడదామా అన్నట్టు యోచించింది.

'కూరలూ, చీరెలూ మాట్లాడితే, దొంగవిచారాలన్నిటికీ శుచర్కి యీర్ష్యలకూ సానుభూతి చూపితే, యితరుల్ని నిందిస్తే, ప్రపంచాన్నీ దేవుణ్ణీ తిడితే, వూరికే విచారాల సొద వెళ్ళబుచ్చుకుని వారి ఆధిక్యాన్ని నిలవ పెడితే ప్రజలు చేరతారు.'

'పోనీ యీ ఆపదలో నైనా—'

'ఆపదవొస్తే చాలదు. ఆపద ముందు కుంగిపోవాలి. సహాయానికై అరవాలి. ఏసహాయమూ యివ్వక పోయినా, కృతజ్ఞత చూపాలి. సహాయం అక్కర్లేదంటే ప్రపంచానికి ఎంతోకోపం వొస్తుంది! ముఖ్యం ఆడదానిమీద. అందువల్లనే అడకువనీ, దీనత్వాన్నీ స్తుతించారు శాస్త్ర కారులు! అవి సుగుణాలేకావు. జీవనోపాధులు.'

ఇంకా అంది.

'మీసహాయం కృతజ్ఞతతో నేను స్వీకరించక పోవడం మీ కెంత బాధకరంగా వుందో నేను గమనిస్తోనే వున్నాను. కాని, మీరు కొంత ఉన్నతంగా వున్నారు.'

నివ్వెరబోయి చూశాను. ఏమి మనిషి! నానోటమాటరాలేదు కొంతసేపు. సమర్థించుకుని

'ఏమైతేనేం? నేను మీకోసం కొంతకాలం వినియోగించ తలుచుకున్నాను.'

'సరే.'

'కాని నామీద నమ్మకం పెట్టుకోవొద్దు.'

అన్నాను దడిపిస్తో.

'సరే.'

అరే!

'ఒకవేళ నేను అపజయం పొందితే!'

'పోనీండి.'

'ఐదువందలు ఇయ్యనా?'

'నాదగ్గిరే వున్నాయి. కాని, ఇయ్యను.'

'మరి!'

'జైలుభయం లేదు'

'కాని అపవాదు — కోర్టు ప్రశ్నలు.'

చిరునవ్వుతో వూరుకుంది,

'చెప్పండి'

'నేను రాక్షసిని.' అంది నెమ్మదిగా!

అని పరధ్యానంలో పడ్డది, లేచి వెడుతున్నాను అన్నానుగాని. ఆమె పలకలేదు, మెల్లిగా తలుపు మూసి వెళ్ళాను, సందుచివర అదే ఆలోచిస్తున్నాను. తలుపు గడియ వేసుకోలేదే, పన్నెండయింది.

క్షేమమా? మళ్ళీ వెళ్ళాను. అట్లానే కూచునివుంది. మూల దీపం వెలుగుతోంది. మంచంకింద చీకట్లు కూచున్నాయి.

'నేను వెడుతున్నాను తలుపు వేసుకోండి.' కొంచెం సేపటికి తలెత్తింది, గడియారంవంక చూశింది.

'క్షమించాలి. ఏదో ఆలోచనలో పడ్డాను,'

'నేను వెడుతున్నాను, తలుపు వేసుకోండి.'

నావెంటనే తలుపు దగ్గిరికి వొచ్చింది. తలుపు దగ్గిర వెడుతున్న నా బుజంమీద చెయ్యేసింది. తిరిగాను. నాచెయ్యి గట్టిగా పట్టుకుంది.

"మీకెందుకు భయంలేదు?" అని అడిగాను

"ఆశలేదుగనక." అంది — అని ఆగి మళ్ళీ—

'మీరు మంచివారు లాగున్నారు. ఈ లోకానికి పనికిరారు.'

అని చిరునవ్వు నవ్వింది. పెదవులేకాదు, కళ్ళేకాదు, ముఖ

మంతా, ఆమె శరీరమంతా పెద్ద చిరునవ్వువలె తోచింది. ఆరాత్రంతా ఆమే నా కలలలో.

* * *

మర్నాడు పోలీసు ఇన్‌స్పెక్టర్ని చూడడమూ, సబిన్‌స్పెక్టర్ని చివాట్లు పెట్టించడమూ, అయ్యేప్పటికే మధ్యాన్నమయింది. ఇన్‌స్పెక్టరు నాలుగు అర్జీలు నాముందు పెట్టాడు. నన్ను చదవనీలేదు గాని, అవన్నీ వూళ్ళో పెద్దమనుషులదగ్గిర్నించి అనీ, ఆమె సత్తిరాజు చావుకి కారణమనిన్నీ. ఆమెని ఎరెస్టు చేయమని ప్రార్ధనలూ బెదిరింపులూ అనీ చెప్పాడు.

'ఏమో సాక్ష్యం ఎట్లా తిరుగుతుందో అని భయంగా వుంది. అమె పక్కలో చచ్చిపోయినాడు. ఆ వుత్తరమే లేకపోతే, ఆమెపని అపాయమయ్యేదే! వూరందరకీ ఆమెమీద చాలాకోపంగాగుంది. కొద్ది రోజుల్లో ఆమెని ముంచడానికి ఏదో అల్లేట్టున్నారు. ఆమె వెంటనే యీవూరు వొదిలితే బావుండును.'

సాయింత్రం నేను వెళ్ళేప్పటికి ఆమె వరండాలో గట్టుమీదికి కనపడకుండా వెనకాలగా మంచం వేసుకుని గోదావరివంక చూస్తో కూచుంది. నావంక చూడలేదు. నేను ఎదురుగా కుర్చీలో కూచున్నాను. అమె యింట్లో, గట్టుమీది ప్రజలకు నేను కనపడుతూ కూచోడం నాకు బాధగానే వుంది. గాలికి యిసిక రేగి నీళ్ళమీద పడుతోంది. నీళ్ళచింది యిసికమీప పడుతోన్నాయి. కొవ్వూరు పడవ పూర్తిబరువుతో మూలుగుతూ పోతోంది రెండోవేపు.

మెల్లిగా నావంక చూసింది. అపాయం తప్పించని చెపితే తల వూయించింది.

'కాని మీరీ వూరు వొదిలితే మంచి' దన్నాడు.

'మంచిది కాకపోతే నేం?'

'అంత మొండితన మెందుకు? వొదిలితేనేం? నష్టమేముంది?'

'ఎందుకు భయపడాలి !'

'భయ మేముంది ! ఇట్లాంటి అనవసరమైన పంతంతోనే మీరు వొంటరై పోయినారు లోకమేమీ అంత చెడ్డదికాదు. కాని దగ్గిరికి వొచ్చిన వాళ్ళనల్లా రక్కితే వూరుకుంటారా ?'

'కొంత చిడుం వొదులుతుంది.'

'మీకేం సంతోషం ?'

'బరక్కపోతే నెత్తినెక్కుతారు.'

'మధ్యమార్గం లేకపోలేదు. మరి మీరు ప్రయాణం కావాలి. వినరూ ? పోనీ. మీకోసంకాదు. నాకోసం.'

'సత్తిరాజుగారి కోసం అవునా ?'

'అదేవద్దంటున్నాను. ఎందుకు ? ముందే అనుమాన పడతారు ? అందుకే ప్రజలు కోపగించుకుంటారు. నేను నాకోసమే అడుగుతున్నాను.'

'నాకూ మీకూ ఏమి సంబంధం ? మీరెవరు, నేనెవరు ?'

'సంబంధం వున్నవాళ్ళని దగ్గిరికి రానిచ్చారా, మాట్లాడ నిచ్చారా?'

'అవును. మీకెందుకు ?'

'అవును ! నాకెందుకని లోకాన్ని మీరు వొదిలినా. లోకం మిమ్మల్ని వొదలలేదు. శత్రువులూ. మిత్రులూ వుండనే వుంటారు.'

'నన్నెవరూ ఏమీ చెయ్యలేరు.'

'అహంభావపడకండి. ఎంతవారైనా మనుష్యమాత్రులే.'

'పోనీలెండి, ఎందు కదంతా? ఎక్కడికి వెళ్ళాలినేను....ఎందుకు వెళ్ళాలి ? నేను వెళ్ళను.'

ఆమె చెయ్యి పట్టుకున్నాను.

'మీకు బాధకలిగితే నేను భరించలేను. నాకోసం.'

నవ్వింది.

'—నటన.'

'పోనీ అట్లానే.'

'ఎక్కడికి వెళ్ళను, నాకెవరూ తెలీదు.'

'మావూరురండి.'

'మీవూరా ? నిజంగానే !'

కొంచెం వుత్సాహం వొచ్చింది,

నేను చేసిన తప్పు గ్రహిస్తున్నాను. కాని కాలు వెనకకి యెట్లా తియ్యను ?

'నిజమే.'

'వొస్తే........అంత భారమూ మీదే.'

చచ్చాను. ఈమెని యేం చెయ్యను ? ఎట్లా పోషిం—

'నాకు డబ్బు వుందిలెండి. భారమంటే సామాన్లూ, యిల్లూ, హోటలూ—అన్నీ

అమ్మా ! నాయింటోనే దిగుతుంది గావునని ఎంతో భయపడ్డాను. ఈమె దిగితేవా ! నా వుద్యోగం సున్న ! ఆ రంగాచార్లు వూరుకుంటాడా ? వూరంతా మోయించడా ?

'సరే.'

'మీవూళ్ళో నేనున్నయింటికి మీరు రానఖర్లేదు లెండి' అంది.

'ఎందుకు రానూ ?'

చిరునవ్వు నవ్వింది.

'సరేలెండి. మీకే తెలుస్తుంది.'

'మీరు చెప్పాలి.'

'ఏం లేదు. నేను రాక్షసిని.'

'అట్లా అని ప్రపంచాన్ని బెదరకొట్టి విరోధం చేసుకున్నారు, అంతే.'

అంధకారంలోకి కొట్టుకుపొయ్యే తెరచాపల్నీ. నీటి మీదనించి వొడ్డువేపు చీకట్లో కలిసిపొయ్యే గబ్బిలాల్ని చూస్తో కూచున్నాము.

మీకు వెంటనే బైలుదేరడానికి వీల్లేదా ?'

‹మీదే ఆలస్యం.'

‹మరి కర్మ....మీ భర్తకి....అపరకర్మ....'

‹ఏంలేదు.'

నిజంగా రాక్షసే!

‹చెయ్యకపోవడ మేమిటి ?'

‹ఎందుకు ?'

‹ఎట్లా?'

ఈ రాక్షసి నావెంట పెట్టుకుపోతున్నాను ? తప్పించుకోడానికి వీలులేదా ?

‹వూరికే ముసిలమ్మమల్లే ప్రశ్నలు వెయ్యకండి. చదువు కున్న వారు కూడాను! చెయ్యకపోతేనేం ?'

నిజమే. చెయ్యకపోతేనేం ? జబాబుఏముంది ? ఇదివరకు ఆప్రశ్న వేసుకోలేదే నేను. ఎందుకు చెయ్యాలనే సంశయమేరాలేదే! జీవితమంతా యింతేగావును! ‹అంచరూ చెయ్యటం లేదా ? 'వూరుకుంటారా ? 'వెలి' ఇట్లాంటి ప్రశ్నలువొచ్చి నోరు నొక్కుకుని వూరుకున్నాను. కాని గౌరవం నిలుపుకోడానికి వేదాంతంలోకిపోయి ‹మరి అతని ఆత్మ-. అన్నాను.

చచ్చాను!

'ఆత్మ ఏమవుతుంది ?'

‹నాకేం తెలుసు ?'

'పోనీండి ఏదోతెలిసినట్టు ఆయన ఆత్మకోసం ఆదుర్దాపడితే మీకే మన్నా ఆత్మలసంగతి తెలుసునేమో ననుకున్నాను.

ఆలోచిస్తున్నాను. ఇట్లా తిరగబడితే- ఎవరూ లేరా యీామెకి సలహాయిచ్చేందుకు ?

'మీఅకాగారు........'

'మీ కెట్లా తెలుసు ?'

‘చెప్పారు. ఆమె రాలేదా ?’

“వొచ్చింది. వీధులోంచే యేడ్చుకుంటో—’ “ఏమే! యే కష్ట మొచ్చిందే ? అట్లా యేడుస్తున్నావు ?” అన్నాను. ‘అయ్యో నీకోసమేనే ఎంత కష్టంవొచ్చిందే నీకు’ అంది. నాకష్టం అట్లావుణ్ణీ. వొచ్చిన కష్ట మంతా నీకు లాగుందేమే! అదెట్లా జరిగిందే! నాకు తెలీనే తెలీదు” అన్నాను. తిట్టుకుంటో పోయింది.’

‘అట్లానే అనవసరంగా పోట్లాడతా’ రన్నాను.

‘అనవసరంగానా ?’ అని కోపంతో అని నెమ్మదిగా

‘అవును, మరిచిపోయినాను’ అంది.

‘ఏమిటి ?’

‘ఏమీలేదు.’

‘చెప్పాలి. తప్పదు.’

‘మీరూ వాళ్ళలో ఒకరని మరిచిపోయినాను.’

‘ఒకణ్ణే, కాని మీతో సంపూర్ణమైన సానుభూతిని కలవాణ్ణి. మిమ్మల్ని అర్థం చేసుకోవాలని ప్రయత్నిస్తున్నాను. మీకు మాత్రిం నా అనుభవంనించి నేర్చుకోగల విషయాలు వుండకూడదా ?’

‘నిజమే లెండి.’

‘అవును, మీరు వృథాగా యితరుల్ని బెదరకొడుతున్నారు. మీలో వున్న హృదయవిశాలత్వాన్ని వాళ్ళు చూడడానికి అవకాశాన్ని యియ్యరు. ఇస్తే తక్కిన సంగతులు వాళ్ళు క్షమిస్తారు.’

‘నేనేం చెయ్యను. నాకీ చావువల్ల విచారం రాలేదు. నటించనా ?’

‘ఎందుకు విచారం లేదూ ? నేను నమ్మను.’

‘లేదు, అంతే.’

‘ఐతే, అసాధారణ స్వభావమైనప్పుడు కొంత నటన ఆవసర మేమో!’

‘చాతకాదు.’

'ఇకనన్నా మార్చుకోవాలి.'

"మీసౌఖ్యం కోసమా ? మీవూరు వొస్తున్నాననా !

నావంటి దానితో మాట్లాడడం మీకు నామర్దా. వెళ్ళండి. ఎవరు పిలిచారు మిమ్మల్ని ! నాతోవన నన్ను బతకనీక, నన్ను యీప్రపంచంతో కలిపెయ్యాలని మిత్రులవలె. శత్రువులవలె, నన్నెందు కిట్లా బాధపెడతారు ?"

"చూశారా మీ 'యిగోయిజమ్ !' నేను నాసంగతే తలచుకోలేదు, మీక్షేమం విచారించే మాట్లాడాను. ఇదివరకు సత్తిరాజుగారున్నారు. ఆయన రక్షణ కూడా వుండదు, లోకమెంత క్రూరమో మీకే తెలుస్తుంది, అందులో స్త్రీలు."

'స్త్రీ ఐతే నేం ?'

'ఐతే నేమా ? రౌడీలు. పోలీసులు, విటులు'

'నాలో యితరులాసించగల ఆకర్షణలేదు.'

'పురుషుల పశుత్వపు బలం మీకు తెలీదన్న మాట.'

'పోనీండి. అంత నామీదే కాంక్ష గలిగితే, అంత అపాయం తటస్థిస్తే, కానీండి, పోయిందేవుంది ?'

ఇంకేమనను ?

"నా క్షేమం విచారించే చాలామంది చాలాచేశారు. ఇతరుల క్షేమం కోసం సలహాలిచ్చేవాళ్ళంత దొంగలు ఎవరూలేరు." అంది—

* * *

మెల్లిగా ఆ యింటి వెనక చంద్రుడుదయించాడు. గోదావరి అవతలిగట్టు ముసుకు తొలగించి, మమ్మల్ని చూసి నవ్వింది.

ఆమె నావంకచూడక ఏదో ఆలోచనలో పడ్డది. నా మనసంతా ఆమెతో నిండిపోయింది. వెన్నెలా, గోదావరిజలం, ఆమె రూపమూ అన్ని ఐక్యమైనాయి. ఆమెఆత్మ శరీరంలోంచి క్రమంగా నాచుట్టూ అలుముకుంది. నా కళ్ళముందు మధ్యాన్నం చూచిన ఆమె చూపులవెలుగే కనబడుతోంది.

ఆమె కంఠంలో గంభీరత్వం వినబడుతోంది యింకా. గొప్ప పాటలో, కవిత్వంలో, సముద్రపు లోతులో వుండే గాఢత్వం గుర్తించాను ఆమెలో. గొప్పతనం అనుభవంలో ఆత్మలో వుంటేనే కాని కళ్ళల్లో కనబడడం అసంభవం. ఎంతో సాధనచేసి సంగీతంలో నేర్పు సంపాయించవొచ్చు, స్వభావసిద్ధంగా కంఠమాధుర్యం వుండవొచ్చు. కాని ఆత్మల నాకర్షించి, లోకరహస్యాలను విప్పి చెప్పగలడానికి పాటకుడిలో ఆత్మ ఔన్నత్యం వుండాలి. జన్మవల్లనో, ఆత్మసాధనవల్లనో గొప్ప చిత్తసంస్కారం సంపాయించింది. ఆగంభీరత్వమే పలికింది నా ఆత్మలో ఆమె చూపు లోంచి, కంఠంలోంచి.

సత్తిరాజుగారిని రక్షించగలిగికూడా, తప్పుకోడం న్యాయమేనా మీకు ?'

ఆమెని చూచినకొద్దీ సందేహాలే నాకు. ఆమెలోని ఉదారత్వానికీ, ఆమె చేసిన పనులకీ సామరస్యం కుదరక వూరికే ప్రశ్నలు వేస్తున్నాను.

ఆలోచించింది చెప్పనా, వొద్దా అని.

"మాయిద్దరికీ గొప్ప ప్రేమా లేదు, విరోధమూలేదు. సాధారణ కుటుంబాల వంటిదే. కాని ఆయన స్వభావం మోహపూరితం, నాది సత్య పూరితం. అందుచేత సామరస్యం కుదరలేదు. పుస్తకాల్లో చదువుతాను. కాని దారుణమైన పురుషవాంఛ నేనెరగను. పాపం! తృప్తికానీ ఆ మోహోద్రేకానంతా ఆ మళయాళ స్త్రీ మీద వర్షించారు. విఫలమయింది. నిరాశా, ఈర్ష్యా యిన్నీ ఆయనకి జీవితంమీద ద్వేషాన్ని పుట్టించాయి గోదావరిలో పడాలని ప్రయత్నించారు. నేను తప్పించాను. నేనే పట్టు పడితే ఆయన్ని యింకా బతికేట్టు చెయ్యగలిగి వుందును. కాని అవసరం కనిపించలేదు."

'అవసరం కనిపించలేదేమిటి ?'

"అవును. ఎవరి కవసరము ? నాకు కాదు, పిల్లలువుంటే ఆలో చించి వుందును. ఓవర్సీస్లు కావలసినంతమంది. ఆయనవల్ల ఎవరికేమి

అవసరం ?"

'పోనీ బతికితే నేం?'

'ఆయన బాధ?'

'స్థిరంగా వుండేదా ?'

'వుండదేమో ! కాని చస్తేనేమి ? ఎన్నిజీవకోట్లు చావటం లేదు?'

'బావుంది.'

'కనక, నాకు బాధలేకండా చంపే మందు తెలుసు-అది యిస్తా నన్నాను. ఇచ్చాను.'

నాకు ప్రపంచమే అంధకారమయింది.

* *

నేను బడికి నెలరోజులు శెలవుపెట్టాను. ఆమెని గుంటూరు తీసుకువెళ్ళడానికి గుండెల్లేవు. ఆవూరూ యీవూరూ, మేమిద్దరము ఎవరికీ తెలీని స్థలాల్లో తిరుగుతున్నాము. ఆసాయంత్రం ముక్తూరు బంగళా వరండాలో కూచున్నాము, సముద్రంవంక చూస్తో.

నిజంగా ఆమె విచిత్రమైన వ్యక్తి. నా పక్రనే మంచం వుంటే అక్రడే పడుకుంటుంది. ఒక బంగాళాలో మంచమే లేదు. నాపక్ర తడిసిపోయింది, ఇద్దరం ఒకటే పక్కమీద పడుకు న్నాము. చెయ్యిదగిలినా, నిద్దట్లో మీద చెయ్యివేసినా ఏమీ మాట్లాడదు. ఆమెని చూస్తే,-నాకు మోహమా ? లేదు. అమితమైన భయం. వొంటరిగా ఆడదానితో తిరుగుతూవుంటే, కుమ్మరిపోలిని చూసినా అసహ్యం మరిచిపోతాం ఏదో నిమషాన. లక్ష్మీదేవిమీద భక్తి మరిచిపోతాం ఏదో ఒక సమయాన. కాని నేనుఅడిగితే, ప్రేమచూపిస్తే, వెకిరించి యేడిపిస్తుందని భయం. సెంటిమెంటు, భయం, అబద్ధం యివేమీలేవు. అంతా సైంటిస్టుమల్లే విడతీసి ఆలోచించి సరిహద్దు లేర్పరుస్తుంది. స్నానం చేస్తోకూడా తలుపు గడియవేసుకోదు. చీరె కట్టుకోడానికివొచ్చి నన్ను అవతలికి పొమ్మనదు. రైలు అందనీ, తప్పనీ, భోజనం దొరకనీ,

మాడనీ, ఒకచే ఆమెకి. ఎకరెడికి, వెడుతున్నాము, ముందేమిటి యీ ప్రశ్నలేలేవు. ఆకుర్రాణ్ణి రుషివాలీ హాస్టలుకి పంపించాము. యిద్దరమూ ఆలోచించి. చదవదు, పాడదు, మాట్లాడదు. నేనెందుకు తిరుగు తున్నాను? ఆమె మరి నా మీద యే ఆకర్షణ ప్రయోగంచేసిందో. ఆమె వుంటేగాని నాకు శాంతిలేదు.

ఎనిమిదయింది. సముద్రం చీకటికి తిరగబడి అరుస్తోంది బోనులో కొత్తసింహంలాగు. గంటసేపణ్ణించి ఆమె మాట్లాడలేదు. నాకు 'పైప్' అన్నా స్నేహముంది. ఆమెకీ! ఏమి ఆలోచిస్తుందో! వొంటరితనం భరించలేక ఏదో ప్రశ్నవేస్తాను. మాట చెపుతాను. ఊఁ అని వూరు కుంటుంది.

ఇక భరించలేక కుర్చీమీదవున్న ఆమె చేతిమీద చెయ్యివేశాను. కొంచెం అట్లానేవుంచి చెయ్యి మెల్లిగా తీసేసుకుంది. ఆరాత్రి నామనసు మొగతనంతో మారాము పట్టింది, నాచేతిని ఆరాత్రిప్రతిమ బుజంమీద వేసి, వేళ్ళుబిగించాను. వూరుకుంది. కొంత సేపటితరువాత తన చేత్తో నావేళ్ళని పట్టుకొని చాలాస్నేహంగా, జాగ్రత్తగా నా కుర్చీమీదికి తీసుకొచ్చి వొదిలి తన చేతిని నా చేతిమీద కొంచెంసేపు వుంచి తీసేసుకుంది. అంతకన్న మోహానికి యింక నిరాశ ముంది? నా చంపమీద ఒక్కటి చరిస్తే ఎకురెవ ఆశ వుంటుంది.

వాచరు మా టిఫిన్ కారియరు తీసుకొచ్చాడు.

'వంటలేదటండి యీ పూటకి!'

గుండెల్లో రాయిపడ్డది.

వూరికి మూడుమైళ్ళ దూరంలో వున్నాము.

'మరియెట్లా?'

'నువ్వు వొండు' అంది ఆమె, ఆవాచరుతో

'కూర యేం లేదు.'

'ఏదో వొకటి చెయ్యి-పచ్చడి, చారు' అన్నాను.

'ఏమీ లేవు.'

'మరి మీరెట్లా తింటారు ?'

'చాపలు'

చచ్చాం.

'అవే చెయ్యి' అంది ఆమె.

'ఎందుకు ?'

'తిందాం.'

'చాపలా !'

'ఏం ?'

'నా చాతకాదు.'

'ఎందుకు చాతకాదు. అంతా చాతనవుతుంది వెళ్ళు.'

వాచరు వెళ్ళాడు.

'ఏమిటి ? చాపలు తింటారా మీరు ?'

'ఎప్పుడూ తినలేదు.'

'మరి తినగలరా ?'

'ఎందుకు తినలేను !'

'కాని తినవొచ్చా !'

'ఏం తింటే ?'

'ప్రాణిహత్య.'

'ఏమైతే....'

'పాపం: మన తిండి కోసం—'

విసుకుతో—

'లోకమంతా పెద్ద హత్యామందిరం. చూడు. అన్నికోట్ల ప్రాణులకూ చావే అంతం. అంతేకాదు, ఒక ప్రాణికి యింకో ప్రాణిఆహారం.'

'కాని మనం మనుషులమే—'

'ఐతే నేం ? దేవుడూ చంపుతాడు, మృగమూ చంపుతుంది.

మధ్య మనిషిమాత్రమేనా చంపకూడనిది ?'

'కాని వాటికి బాధ !'

'మనం కాకపోతే యింకోపెద్దచాప తింటుంది, రోగంతో బాధపడి చస్తాయి. ఏట్లానూ తప్పదు.'

నోరు మూసుకున్నాను.

చేపల కూరతో భోజనం వొచ్చింది. నేను ముందేవెళ్ళి, దూరంగా పొయ్యిమీద అన్నం వొడ్డించుకున్నాను, ఆమెకి దూరంగా కూచున్నాను భోజనానికి. ఐనా వాసనవొస్తోంది. ఆమె ముందు కొంచెం మొహం చిట్లించింది. వెముక లెట్లా తియ్యాలో అప్పుడప్పుడు వాచర్ని ప్రశ్నించింది. మాట్లాడకండా తినేసింది, నేనేమీ తిననేలేదు.

భోజనం తరవాత కుర్చీ దూరంగా వేసుకుకూచున్నాను,

'దగ్గిరకి రండి. వాసనలేదు.'

అని నా దగ్గిరికి వొచ్చి చేతిని నా ముకుపుమీద అదిమింది, అంబరు వాసన వేసింది. ఆ చేతిని పట్టుకుని చెంప కదుముకున్నాను.

'చూడండి. నానోరూ వాసనలేదు. నుంచోండి. వాసన చూడండి.,

లేదు.

నిద్రపోయినాము. నాకు ఆమె కలలే వొస్తున్నాయి. కలలోకూడా ఆ బంగాళయే—ఆమె లేచి నా పక్కన ఏడుస్తో కూచున్నట్టు, మళ్ళీ మారి నన్ను కావిలించుకున్నట్టు ఇద్దరం వొళ్ళు తెలియక మంచంమీద నించి దొల్లినట్టు, కలతో వులికిపడి లేచాను, ఆమె పక్కవేపు చెయ్యి జాచాను. ఏమీ తగలలేదు. ఇంకా జరిగాను. ఏమయింది ?

* * *

కిటికీలోంచి వరండాలోకి చూశాను. కొంచెం చలిచలిగా వుంది పగలు కురిసిన వాన వల్ల. ఆమె లేదు. తలుపు మెల్లిగాతీసి చీకట్లో వెతికాను. సముద్రపు వొడ్డున నీటికి ఒక బెత్తెడు దూరంలో యిసికలో కూచునివుంది. చీరె తడుస్తోవుండి వుండాలి నేను కదలక నుంచున్నాను.

నా కలలవల్ల కలిగిన భ్రాంతితో ఆమె మీద కామ పడుతున్నాను. ఆమె కలలో కనపరిచిన దయ యీ వాస్తవ లోకంలోకే ప్రవేశపెట్టింది. నా మనసు—అంగీకరిస్తుందనే నా నిశ్చయం.

మెల్లిగా సముద్రపుఘర్షణలోంచి చంద్రుడుదయించాడు. ఈ దృశ్యాన్ని చూసే, యే కవో సముద్రం తరచగా చంద్రుడుదయించాడని వ్రాశాడు పురాణాల్లో. చంపలమీదా మెడమీదా ఆడుతున్న నల్లని జుట్టు మెరవడం ప్రారంభించింది. ఇసికనేలమీద పిండిజల్లినట్లుంది. నీళ్ళు భయం మాని కలకల మంటున్నాయి. ఆమె తదేకదృష్టితో చూస్తోంది. సముద్రాన్ని-పెదవులు కొంచెంగా కదులుతున్నాయా అనిపించింది నాకు.

'ఏమిటి ఇక్కడవున్నావు?' అన్నాను బుజంమీద చెయ్యేసి. నావంక తిరిగి చూడలేదు.

నిద్రపోతున్న కనుగుడ్డువలె నీళ్ళమీద నిలిచింది చందమామ.

'చూడండి. చూడండి.' అంది నావంక తిరగకండానే. చంద్రుడి పచ్చని కాంతి ఆమె నుదుటిమీద పడుతోంది. ఆమె కంఠం నాతో ఏదో రహస్యం మాట్లాడినట్లయింది. మా యిద్దరికే తెలిసిన సంగతి, యింకెవరికీ తెలీనిది. ఆమె వంక చూస్తో దిగ్భ్రమచెంది నుంచున్నాను. ఆమెరూపమే మారింది, మాంసమూ, ఎముకలూ కరిగి పోయినాయి ఆ గాలిలోకి. మొహంలోకి పెద్దవెలుగు వొచ్చింది, పెదవులు వొణుకుతున్నాయి. చంపలు యెర్రగా ఐనాయి, పల్చని వక్షంలోకి కొత్తప్రాణం వొచ్చింది. దేహమంతా కొత్తజ్యోతి వెలుగుతున్నట్టుంది.

చూడండి ఆ చిన్ని చంద్రుడు—ఆ నీళ్ళమీద ఆరాటం-నా హృదయంలోనే యిట్లావుందే? ఆహృదయంలోనో! అన్ని సముద్రాలలో-ఆ చంద్రుడిగోళంలో ఆ తెల్లనికాంతి యెంత జీవనాన్ని కల్పించిందో ఎన్ని ప్రాణులు ఆనందనృత్యం చేస్తున్నాయో! ఎన్ని సరసుల్లో నదుల్లో, మేల్కొన్నవో యీ అర్ధరాత్రి, యీ మాధుర్యం. నిన్నటి వాన, యిందాకటి చీకటి యీ వెన్నెల, రేపటి ఎండ, అన్న మనో

భావాలు....ప్రపంచాలు సృష్టించే మనసులోని ఛాయలు — మోహం, బాధ, రోగం, ఆనందం, వేదన యీ చిన్న ఇసిక అలలనించి. భూకం పాలవరకు — చిన్ని పుష్ప వికాసంనించి, నక్షత్ర విప్లవాలవరకు — అన్నీ యివన్నీ ఆ హృదయంలోని అశాంతి మనం యీ యిసికిని చిమ్మినట్టే, యెన్ని గోళాల నాశనమో !

ఆనందవేదన....గానచ్ఛాయలు, యీ కట్లువొదిలి — ఆ వెన్నెట్లో కలిసి, ఆనీళ్ళమీద చిందులు తొక్కితే, — ఇదంతా నేనే — నేనే — నేను వెళ్ళిపోతాను నేను కలిసిపోతాను" అని వూగి మెల్లిగా నా బుజంమీదికి వూగింది. నేను ఆమెని వొళ్ళో పడుకోపెట్టుకుని, పమిటను సద్ది చంపలమీద వేళ్ళు మెల్లిగా రాస్తో కూచున్నాను, అంతకన్న కోరికే లేదు. ధైర్యమూలేదు, నా వొళ్ళంతా గొప్ప ఆనందంతో నిండి పోయింది. ఎడారివంటి యిసిక, సముద్రపు బిందువులతో మీద చిమ్మే గాలి, ఆ పెద్ద హోరు, ఈమె నాతొడలమీద—ఇదేనా స్వర్గమనుకున్నాను. ఆమెనించి గొప్పశక్తి నాలోకి ప్రవహిస్తున్నట్టుంది. ఇట్లా యింద్రి యాలన్నీ ఉన్నతానందాలకి మేలుకోడమే స్వర్గం. స్వర్గం ఒక స్థలం కాదు, ఒక స్థితికాదు. క్రమంగా స్వర్గంలోకి ఎదుగుతాం యవ్వనంలోకి యెదిగినట్టు అనిపించింది. మెల్లిగా యీ మనసూ యింద్రి యాలూ కొత్త, తీవ్రతర ఆనందాలకి మేలొకొంటాయి. అంత మేముంది? ఆ రోజు తెలిసింది నాకు, నలభైయేళ్లూ నేను నిద్రపోయినానని. కాని యీమె ! ఈమెమీద ప్రేమవల్లనా, లేదు ప్రేమలేదు. కాని ఆమెనించి ఏదోశక్తి ప్రవేశించి నా బంధనాలు వొదిల్చి మేలొకొలిపింది, అట్లా సౌంద ర్యంతో ఐక్యమై కూచున్నాను.

మెల్లిగా కళ్ళువిప్పింది. చిరునవ్వు నవ్వి లేచి కూచుంది. జుట్టుని దగ్గరగా తీసుకుని ముడి వేసుకోపోయింది. నా మనసులో ఏం మార్పు వొచ్చిందో. ఆమె వొళ్ళో తలపెట్టి పెద్దగా యేడ్చాను. ఆమె మాట్లాడ లేదు. క్రమంగా నాఆరాటంతగ్గింది, నా ఆనందమంతా పోయింది. పెద్ద

శూన్యం! బాధా ఆవరించాయి, వెన్నెల వున్నా అంతా చీకటిలాగే తోచింది ఆమెని కావిలించుకున్నాను. కొంచెంవుండి లేవపోయింది. వొదల లేదు నేను. ఆమెని మెల్లిగా ఇసుకలోకి వంచి పడుకున్నా. అట్లానే చూస్తోంది, ఐనా నాకు ధైర్యంలేదు.

'మీరు కావాలి నాకు'

అనేశాను. నా ప్రాణాల్ని ఆమెముందు పారేశాను,

'నేను ! నిజమా ?'

ఆమె పెదవి విరిచింది.

నిజమా ? ఆమె కావాలా ఏమో తెలీదు. కాని యీ బాధేమిటి ? ఆమె కోసమే. ఇంక ఏవిధంగా భరించను ! అదే గతి !

కాని....ఆమె రొమ్ముకి వొత్తుకోకుండా గుండీల్ని తీసేశాను. ఆమె మెడపక్కనముద్దుపెట్టుకున్నాను. కాని నాలోకి ఏమీ కొత్త ఆనందంరాలేదు.

ఈమె కావాలా ?

'వొద్దు. లేవండి.'

'లేవను నాకు కావాలి.'

'నామాట వినండి. మీకే తెలుస్తుంది వొద్దు, ఎందుకు యీ చిరాకు'

'కాదు. నా ప్రాణం మీ చేతులో పెట్టాను'

'సరే మీ యిష్టం.'

అట్లానే ఆ యిసికలో వుండిపోయినాము. అట్లానే యిసికలో నిద్రపోయినాము.

తెల్లవారి యెండ మమ్మల్ని లేపతీసింది. సిగ్గుపడి తల వొంచుకుని కూచున్నాను. ఎందుకింత పశువునైనానా అనుకున్నాను.

'సంతుష్టి అయిందా ?' అంది లేచి నవ్వుతో.

ఈమె మనిషేనా ? నాకు కోపంవొచ్చింది అందులో నా సిగ్గుకి తోడు గర్వమూ లేకపోలేదు. ఈమె యింత వేదాంతి రాత్రి నా చేతుల కింద ఆయాస పడ్డదికదా అని ! సుఖంలో మూతలుపడే ఆమె కళ్ళని

ముద్దుపెట్టుకోగలిగిన ఘనుణ్ణి కదా అని! ఆమెలోంచి చివరికి వాంఛని పేర్కాలిపానుకదా అని.

'మీకో ?'

కోరెరేవుంచేకవ సంతుష్టి.'

అబద్ధం. తప్పకుండా అబద్ధం. ఆచేతులవూపు, ఆపెదవుల్లోనితృష్ణ!

'అబద్ధ మాడుతున్నారు. మీకే తెలుసు.'

'ఆ సౌఖ్యం శరీరంది. నాదికాదు. నాకు అవసరంలేదు.'

'పోనీ అదీ సౌఖ్యమేగా !'

'చాలాస్వల్పం'

'నేనూ ?'

'మీరు మీరు, ఏమవసరం నాకు ?' తృణీకారంతో పెదవి విరిచి నా కళ్ళలోకి చూసింది. నామీద ఏమీ ఇష్టంలేకండానేనా—ఆ మాటలువిన్న పురుషుడి హృదయం ఎంత గాయపడుతుందో, అంతకన్న భూమిలోకి కుంగిపోతే నయమనిపించింది.

'మరి యిష్టంలేకండానే—'

'అవును'

'ఎందుకు ?'

'ఏమైతేనేం?'

'మీదేహం—యీవ్యభిచారం—'

'దేహంది'

'ఇంకెవడన్నా అడిగితే—'

'తీసుకోనీండి-ఏం ఉపయోగం అంతకన్న-మరీ అంత బాధ పడితే—పోనీండి-ఇస్తేనేం — ఇంతలో ;' మీరైతేనేం ఇంకోరైతేనేం

"—ఎవరూ కాకపోతేనేం ?"

"మరి నా మీద ఇష్టంలేదా ?"

"దానికీ దీనికీ సంబంధమేమిటి ?"

# వాణి - ఏస్టడి

అన్న లాక్కొచ్చి యింటో పారేశింతరవాత వాణిగతిచాలా హీనమైపోయింది. కాళ్లూ చేతులూ విరక్కొట్టి కట్టేశి ఆమె నిస్సహాయ స్తితినిచూసి, బాగా యేడిపించి కసితీర్చుకుంటున్నారు, ఇంట్లోవాళ్లూ బైట వాళ్లూకూడా. కాని వాణి "స్పోర్టు". ఎంతవిచారంలోనూ ఆమె "హ్యూమర్" విడవదు.

"ఓరి మీదుంపల్‌తెగా, బోనులో ఎలికను పొడిచినట్టు పొడుస్తున్నారేమర్రా నన్ను!" అని అరుస్తుంది.

"ఈ బోడిముండ లందరూ నన్నుచూసి అసూయ పడకపోతే, జుట్లు పెంచుకుని తలో మొగాడి వెంటా పడకూడదూ?" అంటుంది.

ఆమె నోటికి వెరిచి యెదుపుగుండా ఆమె నేమీ అనడానికి జంకుతారు. సిగ్గు పున్నంతవరకేగాని తారాబాయివలె రోడ్లమీద మొగవాళ్ళ బట్టలు వూడలీసి, వెంకటచలంమల్లే కధలువ్రాసి, గుట్లు బయలుపడేస్తే, ఎవరికైనా భయమేకద!

వాణిని రెండునెలల కిందటివరకు ముద్దుగా పెంచారు. పెనిమిటి పోయినాడనే సానుభూతివల్ల ఆమెకేమి తిండిలోగాని శృంగారంలోగాని లోపంలేకండా, ఆమె తనస్థితిని మరవడానికి సహాయంచేశాడు, ఆమె అన్న నరసింహారావు. నవలలు, ఆడస్నేహితులు, మీటింగులు, సినిమాలు, వీటివరకు స్వేచ్ఛనిచ్చి శరీరస్థితిని మరచిపొమ్మన్నారు. కాని

ప్రిబంధకన్య విరహం మాన్పడానికి చంద్రుణ్ణీ, కోవెలనీ, మంద మారుతాన్నీ పంపినట్టు ఫలించింది ఆ ప్రియత్నం. ఇంకోడి పెళ్లానెత్తుక పోయి, సర్వమూ అర్పించిన పురాణమూ, అయిదుగురు మొగుళ్లతో తృప్తిపడని వనిత పురాణమూ, పదహారువేల గోపికలకుగాను పదేళ్ళ వయసునించే కామప్రవీణుడైన పురాణమూ ఆప్యాయంగా చదివింది. 'ప్రణయకథలు వేసుకోము' అని ప్రమాణాలు చేసిన పత్రికల్నే తెప్పించారు. పురాణగాథలున్న సినీమాలే చూడనిచ్చారు. మొగాళ్లురాని మీటింగులకే వెళ్లనిచ్చారు. ఐనా ఎట్లాగో తెలీదు వాణి కొంప ముంచింది.

నీతి నవలల్లో, ఎవత్తా లేచిపోవన్నమాటేగాని, అసలు కథానాయకుడితోనే, లేచిపోయినవాళ్ళకన్న యెకురాని పనులు నాయిక చేస్తుంది. శ్రీకృష్ణుడికోసం రుక్మిణి విరహమూ, అతను యెత్తుకుపోయిన విధమూ చదువుతోవుంటే, చివరికి పెళ్ళి అయిందా లేదా అనేది చాలా స్వల్ప విషయంగా తోస్తుంది.

ఈ పతివ్రతలు పడే విరహాలూ, లేకి కోర్కెలూ, మొగాడిమీది వాళ్ళగుడ్డి కాపీనమూ, విసికిడి వల్లనే కలిగే తాపజ్వరాలూ, లేచిపోయే నీచపువనితలకి వుండనేవుండవు. యథావిధిగా వివాహ మంత్రాలు వుచ్చరించారా లేదా అని చూసుకుంటారు గాని యీలోపల జరిగే కామజ్వర జనిత దుర్వ్యసనాన్ని గమనించరు. పత్రికల్లో కథల్లో పురాణాల్లో యీ పెళ్ళిళ్ళసంగతి చదివి, చదివి, దంపతుల సరాగాలూ, ధ్యానించి ధ్యానించి, పురుషవర్ణనలు మనన చేసి చేసి, ఆ కథలన్నీ ప్రేమయుత పవిత్ర వివాహ మంగళవాద్యాలతో అంతంకావడంవల్లనూ, యేకథలోనూ, పత్రికల్లోనూ, ఆవివాహమైన తరువాత సంగతి, పోట్లాటలూ, పిల్లలూ, తిట్లూ ద్వేషాలూ, జెలసీలూ, చిత్రించకపోవడమువల్లనూ, పెళ్ళికావడము అంటే గొప్ప భ్రమ యేర్పడ్డది ఆమె మనసులో, వాస్తవ ప్రపంచంకన్న వూహా ప్రపంచమే సామీప్యమయింది. విమలను గుర్రంమీద తీసుకు పోయిన వుదయాదిత్యుడూ, పద్మను బుజంమీద మోసుకుపోయిన విక్రమ

సింహుడూ, హేమలతను బంధించిన వజీర్ ఖానూ, స్వర్ణలతను బలా త్కరించిన లాలాసింగూ, మొగవేషంలో యుద్ధంచేసిన ప్రేమలతను ఆలింగనం చేసుకున్న యుద్ధమల్లుడున్నూ వీరందరూ ఆమె కళ్ళయెదుట తిరుగుతున్నారు. భర్తలంటే యీ సామాన్య వెంకటేశ్వర్లూ, శీతారామ య్యలూ కాక గుర్రాలమీదా, రథాలమీదా మెరిసిపోయే యోధాగ్రేస రులుగా తోచారు. ఎవడో తనని కిటికీలోంచి చూడడమూ, మోహించ డమూ, కృష్ణుడివలె తనని తటాలున యెత్తుకుని పోవడమూ, ధ్యానించు కునేది. ఆమె అన్న నరసింహం, సినిమాలో నీతికోసం వెతికేవాడు. అతని చెల్లెలు రొమాన్సుకోసం వెతికేది. పతివ్రత సీత రాముణ్ణిచూచి రొమ్ము విరవడం,ఆహ్వానిస్తున్నట్టు ఆకియన్నువంక చూడడమూ. ఏడ్చేప్పుడుకూడా కులకడమూ, రాముడు నన్ను వొదిలేశాడు, పోనీ మీరెవరూ అంతమాత్రం వారు లేరా? అన్నట్టు 'వలప్ట్యుయస్'గా చేతులు జాచడమూ అతనికి వికృ తంగా కనపళ్ళేదు, ప్రపంచంలోని పతివ్రతలందరూ అంతేగనక. ఏనాట కంలోనో యముడు సావిత్రిని వరించాడని అర్థంచేసుకోకండా ఏడుపేగాని ఫిల్ములో సావిత్రి యముణ్ణేకాదు, ప్రతివాణ్ణీ వరించమని, అడుగుతున్నట్టు నటిస్తే యెవరికీ వెగటుగా తోచదు. ఎందుకు ? ఈ నీతిప్రభువులకి మాటలు ప్రధానంగాని, ప్రవర్తనకాదు గనక ! కాని యిదంతా వాణిని అన్ కాన్షస్‌గా ఇన్‌ఫ్లూయన్సు చేశాయి. ఎక్కడన్నా ఆలింగనం దొరికితేచాలు, శరీరంతోసహా యెగిరి పోవాలని కాచుకుని వుంది, వాణి హృదయం, ఈ లోపున నరసింహారావు అందరితోనూ, తను తన చెల్లెలికి యిచ్చేశిక్షణా, స్వేచ్ఛా, ఆమెశీలమూ, తన ఔదార్యమూ, ప్రక టించుకుంటున్నాడు.

"చూచారా ? ఈ కాలంలో స్వేచ్ఛ నియ్యకపోయినా తంటాయే, ఇచ్చినా తంటాయే నావంటి తెలివిగలవాడేంచేస్తాడంటే, యిచ్చినట్టా యిస్తాడు, మళ్ళీ నిజంగా యియ్యనూ యియ్యడు గవర్నమెంటు మోస్త రనుకోండి. అంతేగా స్వేచ్ఛకూడదనివాళ్ళు స్వేచ్ఛకావాలని మారాం

పడితే యేంచేస్తారు మరి! తెల్లవాళ్ళ దగ్గర్నించి నేర్చుకోవలసింది. అది. ఇప్పుడు మా వాణికి ఏం తక్కువ? మళ్ళీ యే పొరబాటన్న జరగడానికి వీలువుందా?" అంటూ స్త్రీలకు స్వేచ్ఛ కూడదన్నేవాళ్ళనూ, కావాలన్నేవాళ్ళనూ అందిర్నీ హేళన చేస్తున్నాడు.

"ఒకటేనండీ పాయింటు. స్వేచ్ఛ అంటే లైసెన్సు కాదండి. మంచికేగాని చెడ్డకిలేదు. అది తెలుసుకోవాలి. ఆడదానియిష్టం. ఎక్కడికంటే అక్కడికి దాన్నిపోనీండి. కాని వొంటరిగా యింకోడితో వెళ్ళనీకూడదు. అదీ కిటుకు."

అని స్వతంత్రాన్ని తన జేబులోదాచి. క్రమంగా కొంచెం కొంచెం తీసి తెలివిగా యిస్తున్నట్టు మాట్టాడుతున్నాడు.

మూడునెలల కింపట ఒక నాటకం కంపెనీ ఆమె హృదయశాంతికేమోనన్నట్టు ఆవూరు వొచ్చింది. వాళ్ళ ముఖ్యనాటకం రోషనార ఆ నాటకంలో శివాజీ ఏకపత్నివ్రతం చాలా నీతిబోధకమని నరసింహారావు భార్యనీ, చెల్లెల్ని నాటకానికి తీసికెళ్ళాడు, కాని వాళ్ళిద్దరికళ్లూ, శివాజీ రీవిమీదనే వున్నాయి. ఆ ఆడవేషం వేసుకుని అప్పనాచార్యులు, శివాజీ మనసుని మార్చలేక పోయినాడు, తనే ఐతే అంతయోచనా! అనుకున్నది, వాణి. అంత నిగ్రహంవున్న యోధుకి మనసునే చలింపచెయ్యాలి. తన హృదయంలోని ఆదర్శరూపాన్ని శివాజీతో సంక్రమింప చేసింది. నాటకరంగంమీద రోషనార, శివాజీ కోసంచేసే ప్రయత్నాలు చూస్తే, చక్రవర్తి ఔరంగజేబు చెల్లెలు కాదుకదా, బండిమనిషి మీరాగాడి చెల్లెలుకూడా అట్లా ప్రాధేయపడదు. అట్లా ప్రాధేయపడే ఆడదాన్ని వాజీ కాదుకదా, లేకి కోనయ్యకూడా తాకడు, కాని యీ ఆధ్యాత్మిక దేశంలో, యీ నాటికికూడా ప్రతీయింటా ప్రతివ్రతా శిరోమణులు వెలిసివున్నారు. గనుక, ఆ మదపిచ్చి యెవరికీ వెగటుగా తోచలేదు. ఆరోషనారేగనక ఆ రొమ్ము బాదుకోటాలుమాని,

"నీకు యీ భారత దేశ సామ్రాజ్యాన్నిస్తాను. నన్ను రాణిని

చేసుకుంటావా ?" అని శివాజీకి బిజినెస్ ప్రొపోజిషన్ పెడితే?

శివాజీ ?

"అవును. నా హిందూదేశంకోసం ప్రాణాన్నే యిస్తానే ! ఈ యేకపత్నీత్వాన్ని వొదులుకుంటేనేమి ?" అని, వొప్పుకుంటాడను కోండి.

ఇంకేముంది ? ఆ కథ వ్రాసినవాడిని. తిట్లతో ఆశీర్వదిస్తారు.

ఆ శివాజీ శీలభావ ప్రదర్శనానికి ముచ్చటపడి, అతను తనవలెనే వ్యాపారి బ్రాహ్మడని తెలుసుకుని, నరసింహారావు. శివాజీని భోజనానికి పిలిచాడు, తాంబూలం వేసుకుంటూ, నరసింహారావు.

"మగవారి శీలమంటే ఆ విధంగా వుండాలండి. ఆడది మీదపడ్డా చలించని స్థయిర్యం కావాలి."

అంటో వుండగానే. అన్న వెనుకనుంచి తలుపు సందులోనించి చూసే వాణివంక చూస్తున్నాడు అభినవ శివాజీ

ఆ మర్నాడు నాటకం పాకంతా కిక్కిరిసి నిండింది. శివాజీ నాట్య కౌశల్యం అందరూ అద్భుతంగా పొగుడు కుంటున్నారు. కాని పదకొండ యింది. తెరయెత్తలేదు. కనుక్కుంటే శివాజీ కనపళ్ళేదన్నారు. నర సింహారావుగారి చెల్లెలూ మర్నాటినించి కనిపించలేదు. అతాత్తుగా చదువుకోడానికని రాత్రి లక్నో పోయింపన్నారు, నరసింహారావు యింటి ఆడవాళ్ళు.

ఆ మధ్యాన్నమే ఆవొకఠ చూపుతోటే అర్థమయింది వాణికి శివాజీ హృదయము నవనీత మృదులమని. తనని, చూసి నవనీత మృదులమయిందని భ్రమపడ్డది కాని, ఏ నిమిషానైనా పాప మా హృదయం నవనీత మృదులంగానే వుంటుందని తెలీదు. నాటకానికి వెళ్ళేగుంపుతో కలిసి స్టేజీ వెనకాలకి చేరుకుంది. చీకట్లో పకఠ కర్ట నులో నుంచుని చూస్తోంది సమయంకోసం. ఎవరో వొచ్చి, యెగాదిగా చూసి, యెవరని అడిగాడు. చేతిలో రూపాయిపెట్టి. మీసం తగిలించు

కుంటున్న శివాజీవేపు చూసి, ఆయన్ని పిలవమంది. రూపాయి కబురం దించింది చాలా జాగ్రత్తగా. వొచ్చాడు గుర్తించాడు శివాజీ.

"ఏమిటిట్టా వొచ్చావు ?"

"వొచ్చేశాను."

"ఎందుకు."

తల వొంచుకుంది. ఎందుకు వొచ్చేసిందో ఆమెకే తెలీదు; ఈ పారిపొయ్యే స్త్రీలకు చాలా మందికి తెలీదు. లోకమంచే యేమిటో తెలీని పంజరాల్లో పెరగడంవల్ల, లోకం ఆకర్షణీయమైన అనేక వింతరంగులతో కనబడుతుంది. కటకటాల మధ్యనుంచి. సామాన్యపదార్థంకూడా అసాధారణ లావణ్యాన్ని ప్రదర్శిస్తుంది, పాపం, ఆశతోనిండిన వాళ్ళ పిచ్చి నేత్రాలకి. హృదయంలోనూ తన ప్రపంచం; పుస్తకాలు, వార్తలు, సినీమాలతో ప్రేరేపించే ఉద్రేకాలకు వాంఛలకు, తట్టుకోలేక, సామాన్య దినచర్య జీవరహితంగా తోచి; స్వేచ్ఛకోసం పెనగులాడి, తపనపడి, అమాంతం దూకుతారు, పంజరంలోంచి, నిప్పుగుండంలోకి.

మానవ హృదయం కావండచాత తమకు జీవితం ప్రసాదించని అదృష్టాలకోసం, కలలుకని, ఆశలుపడి, ఈ కుటుంబ ఆటంకాలు, ఈ సంఘ నిబంధనలు, ప్రేమించేవారి అభ్యంతరాలు, తమను; బంధిస్తున్నాయని బావించి, స్వర్గమూ, సౌందర్యమూ, ఆయింటి ఆవతల పక్కన, ఆరోడ్డు దాటితేచాలు, సమస్త అనుభవాలూ, తమకోసం కాచుకుని వున్నాయని ధ్యానించు కుంటారు, పాపం! దీనికంతా ఈవాస్తవ ప్రపంచాన్ని చిత్రించని కథలూ, పురాణాలూ, నాటకాలూ కారణం.

"ఎందుకు వచ్చావు ? వాణి!"

"మీకోసం" అంది

అది నిజంకాదని ఆమెకేతెలీదు, పారిపోయిన ఆమె ఆత్మని వెతుకుతూంటూ వొచ్చింది ఆమె అంతే.

"ఏమంటావు !"

ఆలోచిస్తోంది. అతనే అంతా తనకి సులభం చేస్తాడనీ, కర్త వ్యం చూపుతాడనీ అనుకుంది. కాని అతను తొందరపడుతున్నాడు.

"నేను వెళ్ళాలి తరవాత మాట్లాడదాము." ఎంత సులభంగా అన్నాడు ఆమాట! అతనికేం! తరవాత అంటాడు తాను ఈలోపల యామైపోతుంది?

"కాదు ఇప్పుడేరండి వెళ్ళిపోదాము."

జీవితానికంతా ఇదే, ఒక్కటే ఛాన్సు తనకి. అతనికి నిర్లక్ష్య మైన సంగతి ఆమె చూడటంలేదు. ఎంతసేపటికీ "తనవాంఛ, తప్పించు కోవాలనే తనకోరెక, తన రొమాన్సు" ఇదే యోచన. అతను ఒక సాధనం, నిమిత్తమాత్రం. ఆ హృదయంలోని యెండుగడ్డికి నిప్పంటిం చిన సూత్రం అతను.

కాని ఆమె అందం. ఆమె తొందరా చూస్తున్నాడు అతను.

ఎక్కడో పూర్తిగా అతనికన్నకూడా పురుషుల్ని అదే పనిగా, వృత్తి అలవాటుగా ఎక్సైట్ మెంటుకోసం రుచిచూసిన మామూలు స్త్రీలని తప్ప, యీ విధంగా తననేకోరి అనాఘ్రాతంగా తనదగ్గిరికి అడిగి వొచ్చేవాళ్ళు ఎవరున్నారు? అందులో అంత ఆత్రుత పడుతోంది, బాగా మొహం మొత్తిన అతని రసికానుభవానికి యీ కొత్తపిల్ల కొత్తరుచి కలిగించింది.

"డబ్బు యింకా వీళ్ళివ్వలేదే?"

మాట్లాడకండా పర్సులో నోట్లు చూసింది.

"జంకకండీ. ఇది నా స్వంతం."

"సరేలే, తరవాత?"

అబ్బా! ఎంతజాగ్రత్త యీ మొగాళ్ళకి. అతనే తరవాత అని ప్రశ్నిస్తే, తను ఎంత ప్రశ్నించాలి?

తన కలలప్రకారం జరగటంలేదు చరిత్ర. సుందరమైన స్త్రీవచ్చి తనంతట తాను పురుషుణ్ణి వేడుకోడంవుంది. రోషనారా నాటకంలోనే

వుంది. కాని పురుషుడు నీతి నియమాల వొంకన నిరాకరించడం మామూలుగాని, ఆర్థిక పద్ధతులమీద జంకలేదు. ఇదేమిటి యీ అభినవ శివాజీ ఇట్లాభయపడతాడు? ఇన్ని గారంటీ లివ్వడం చాలా సిగ్గుగావుంది. కొంచెం ధైర్యం తక్కువ పిల్ల, కొంచెం మొండితనం యెక్కువగా లేనిపిల్ల, వెనక్కి వెళ్ళివుండును. కాని చిన్నప్పట్నించి సాహస వంతులైన ఝాన్సీరాణి, మీరా, అహల్యాబాయి మొదలైన వీరవనితల చరిత్రల్ని మననం చేసుకున్న వాణి, పట్టిన పట్టు వదలకూడదని అన్న ఎవరికి బోధించాడో ఆచెల్లెలు, వెనక్కి తగ్గలేదు. కొంచెంపమిట తొలగించి కాసులవండా, పలకసర్లు చూపింది. అతను వాటి వెనుకకూడా చూడాలని ప్రయత్నించాడు. దాంతో మన వరుడికి ఆమెమీద అద్భుత మైనమోహంకలిగింది. "పద" అన్నాడు.

అందువల్లనే ఆరాత్రి రోషనారా చూసేభాగ్యం నాటకాలు అవినీతికి పుట్టిళ్ళని లెక్చరిచ్చిన రామసోమయాజిగారికీ, నాటకాలకి వెళ్ళిన స్త్రీలని వేశ్యలవలెచూసే రాజమ్మగారికీ రోషనారాచూసి, ఉబలాట బడే భాగ్యం లేకపోయింది. టికట్లడబ్బు వాపసుచెయ్యమని గోలచేసే గుంపు కాళ్ళు నలగతొక్కారు, డొక్కల్లో కుమ్మారు. రాజమ్మగారు ఎంతినవారుగు—కాని లేకపోతే పాపం—నాటకం చూసేసరదా కొంత తీరేది.

విశాఖపట్నం సత్రంలో దిగారు. మూడురోజులు ఆమెతోనే గదిలో గడిపాడు అభినవ శివాజీ, ఆమెకీ కొంచెం వూపిరాడాలనిపించింది. అత నికి బైట పడాలనిపించింది. ఒకరితో ఒకరు ఆమాట అనడానికి భయం—ఎకరడ ప్రేమ పోయిందని రెండోవారు అంటారో అని- పలకసర్లు అమ్మితెస్తానని అతనువెళ్ళి సాయంత్రందాకారాలేదు. ఆమె కాచుకుని కూచుంది వొంటరిగా. ఇట్లా ఇతనితో జీవితమంతా గడప వలసిందేనా ? ప్రేమ; స్వేచ్ఛా అంటే యిదా అర్థం ? ఇంతలో చీకిపోవ డమా ? ఏదో ఒక రాత్రికే, ఒక మధ్యాహ్నానికే అయితే హాయిగా

వుంటుంది. జీవితమంతా అదేఐతే! అదికాక వేరే ఆనందం కనపడదు. బతికినన్నాళ్లూ యిట్లా గడపవలసిందేనా? ఇంటి దగ్గిర అమ్మతిట్లూ, అన్నయ్య డాబులూ, పిచికల అరుపులూ, దాసిదాని తగాదాలూ చాలా ఆకర్ష కంగా కనబడ్డాయి. తనుపడ్డ కామ బాధ ఎప్పుడు పారిపోదామా అనే తహతహ అన్ని మరిచిపోయింది. సాయంత్రానికి అతను వొచ్చి డబ్బిచ్చాడు. రాత్రిసంతోషంగా గడిపారు. కాని మర్నాడు పగలంతా మళ్ళా మాయమైనాడు.

ఈ లోపల ఆసత్రంలోనే దిగిన వాళ్ళ దూరపుబంధువు సత్య నారాయణ వీళ్ళనిచూచి, చల్లగా యింటికి వ్రాశాడు. రెండో రోజుకి నరసింహారావు వొచ్చాడు. అన్నను చూడగానే సంతోషంతో అతన్ని కావిలించుకుని యేడ్చింది వాణి. మాట్లాడకుండా యింటికి తీసుకుపోయి నాడు సాయంత్రంరైల్లో.

రైల్లో ఆలోచించుకుంది వాణి, యింటిదగ్గర తనను తన్నడమూ, మాడ్చడమూ, కాల్చడమూ, యివన్ని చేస్తారుగావునని. వెళ్ళి వెళ్ళడంతో బోరుమనియేడ్చి తల్లిమెడమీదపడ్డది.

"ఎరత చేశాడే, అమాయకురాల్ని చేసి?" అని యేడ్చింది తల్లి.

కాని మర్నాటినించి యింటోవారి చూపులూ, సినిమాలు, పుస్త కాలు, స్నేహితులు, చివరికి వీధిలోకి తొంగిచూడడంకూడా కట్టుపడేప్ప టికి, ఆమెకి, ఒక్కసారి తనని వాతలు పెట్టితేనే యింతకన్న నయమని పించింది. "ఇదేంపుట్టిందర్రామీకూ? నన్ను పారిపోనీరు, యింటోనూ వుండనీరు సరిగ్గా, ఎట్లాచావనర్రా! పోనీ గుండుచేయించండర్రా కాశీ రామేశ్వరాలు తిరిగి వొస్తాను, నా కాసులపేరు అమ్ముకుని!" అంది, హ్యూమర్ మాత్రం విడవలేదు ఆ వాణిని. మళ్ళీ ఎప్పుడు పారిపోదామా ఎవడన్నా దొడ్డిదోవనవొచ్చి తనని యెత్తుకుని పోకూడదా? అప్పుడు కనపడలేదుగాని, విశాఖపట్నం సత్రం, సముద్రం, కొండలు ఎంత అందంగా వున్నాయి. శివాజీ ఎంత రమ్యమైనవాడు, అతని కావి

లింతలు-అని యింకా ఎన్నెన్నో యోచింపు కుంది-ఒకరి అనుభవమూ లేక కరువువాచి అన్నీ ఆనాలుగు రాత్రులే కాకపోతే, కొన్ని యీరాత్రులకు దాచుకోడానికి వీలుండకూడదూ? పక్కగదిలో వొదినా, అన్నయ్యా ఎంత సంతోషంగా గడుపుతున్నారు_ఒక పకిరిమీవనే?

కాని వాళ్ళిద్దరూ ఒకరికి రెండోవారు ఎప్పుడు వొదిలిపోతారా, అని ద్వేషించుకుంటున్న సంగతి ఆమెకు తెలుసు. పురుషుడికోసం అరిచే ఆమె నరాలకి!

ఆదీలోకం!



# ముక్తిమార్గం

సిద్ధులూ, బైరాగులూ, సన్యాసులూ, వీళ్ళందరిదగ్గిరా మహత్తర మైన మూలికలుంటాయనీ, కటాక్షం కలిగినప్పుడు భక్తులకూ, తదితరులకూ, వాటిని అవ్యాజంగా యిస్తారనీ అందరికీ నమ్మకమైన విషయమే; నా తలనొప్పిబాధకూడా పోగొట్టుకోడానికని అట్లా ఏపన్నా లభ్యమౌతుందేమోనని ఆశపడి, బూడిదపూసుకున్న ప్రతివాడి వెనకా తిరుగుతున్నాను. రామేశ్వరంలో. వాళ్ళ భాష నాకు రాకపోవడం గట్టి చికాకెచ్చింది. వొచ్చీ రాని అరవంలో ఒక బోసిమునిని తలచూపి మందిమ్మని అడిగేటప్పటికి. ఆ ముసలియోగి, "నాకో కాలనాయిమ్మ"ని వెంటపడ్డాడు. ఇంకోడు తన వొంటి బూడిద నా తలకిరాసి, పావలా డబ్బులు లాగాడు. అరవసన్యాసులు. మళయాళ యతులు, పంజాబు బైరాగులు, బెంగాలీ బోగులు, అందరూ వున్నారుగాని, ఒక తెలుగు బూడిదవాడెవడూ కనిపించలేదు. అర్థమయ్యేట్టు నాబాధ చెప్పుకోవాలంటే.

ఇంక మా వూరికి తిరిగిపోదామనుకుంటో. గంధమాధనంచూచి మరీపోదామని బైలుదేరాను, బైలుదేరేప్పటికే నాలుగున్నర దాటింది. మెల్లిగా యిసికలో కాళ్ళీడ్చుకుంటో పోగా పోగా గంధమాధన శిఖరదర్శనమయ్యేప్పటికే సూర్యుడు కుంకుతున్నాడు. ఈపద్రలన్నీ రాముడూ తమ్ముడూ యెట్లా తిరిగారో, వాళ్ళకి ఏం తోచిందా, అన్నిరోజులు యిద్దరూ మాట్లాడుకుంటున్నారా. అనుకున్నాను. ఒక ఆడది వుంటే, యెన్నికబుర్లన్నా

వొస్తాయి. కాలం తెలీకండా గడిచిపోతుంది. కాని యిద్దరు మొగాళ్ళు— అందులో అన్నతమ్ములు——వాళ్ళని తలుచుకుంటే జాలేసింది. కవికేం? మూడునెలలు చాలా సుఖంగా సంచరించారు, అని ఒక పద్యములో మూడునెలల కాలం అరనిముషంలో కొట్టేస్తాడు. దోవలో, ముళ్లు, రాళ్లు, పాములు, యివి కవి కంటికి కనిపించవు. ఎక్కడ పడుకున్నారు? ఏం తిన్నారు.? అని ఆలోచనే అక్కర్లేదు. ఆకులుతిని ఆర్నెల్లుసుఖంగా బతికారని సులభంగా అంటాడు ఒక కందపద్యంలో, ఏ ఆకులు? అవి రుచి యెట్లావున్నాయి? నోరుపొక్కి యెంత యేడ్చారు? జీర్ణ మెట్లా ఐనాయి? ఆర్నెల్లి తిన్నతరువాత ఆ మనుషులు గుర్తుపట్టేట్టు వున్నారా? ఆసంగతి ఏమీ మాట్లాడడుకవి. పోనీ,ఆర్నెల్లుకాదు, ఆరురోజులు నువ్వు ఆ అడివి ఆకులు తిని వుండు ఆనందంగా అని ఆకవిని నట్టడవిలో వొదిలితే తెలుస్తుంది. ఆ రాతలేమిటో!

ఆ పర్వతాన్ని హనుమంతుడు. తొకాహిడు గావును ఇప్పుడు వుత్తగుట్ట దానిమీదవున్న గుడిమీద, గుడిమీదవున్న డాబామీద ఎకాహను. ఆ పర్వతంమీదనించి రాముడు మొదట చూశాట్ట లంకని, లంకకోసం వెతికాను గాని కనపళ్ళేదు కాని దృశ్యంమాత్రం అతి గంభీరమైనది. రాముడంతటి చక్రవర్తి చూడతగినది. ఆగుట్టమీద రామలక్ష్మణులు ఆజాను బాహులునుంచుని, మూడువేపుల సముద్రాలను, ఆ యిసిక పర్వతాలనూ, ఆపెద్దసమ ప్రదేశాలనూ, పరిశీలించడం తలుచుకున్నాను. అట్లా ధ్యానంలో పడ్డాను. మెల్లిగా చీకట్లుకమ్మాయి. చంద్రుడు బలం తెచ్చుకుంటున్నాడు. సముద్రంమీద పక్షులు గట్లకు వస్తో అరుస్తున్నాయి. స్పష్టంగా కనపడే చెట్లూ, కొండలూ, చీకట్లో దాక్కుంటున్నాయి. వెనకాల యెవరో

"జయ్ శీతారామ్" అన్నారు.

మొదట వాల్మీకి వొచ్చాడనుకున్నా——బాగా బలిసిన పెద్దశరీరము వాడు, పెద్దగడ్డము. రుద్రాక్షలూ, కమండలము కలవాడొకడు వొచ్చి

మంటపం దగ్గిరగా కూచున్నాడు. ఆయన ముఖం స్పష్టంగా కనపడక పోయినా, ఆయన తప్పక నాబాధ మాన్పగలడనిపించింది. సమీపానికి వెళ్ళి కూచున్నాను.

"ఏవూరు అబ్బాయీ" అని గోదావరిజిల్లా తెలుగులో పలకరించాడు. నాఘోష చెప్పుకున్నాను. అంతా కళ్ళుమూసుకు విన్నాడు. ఆనాటితో నాబాధ గట్టెకిరిందనే ధైర్యం యెక్కువైపోయింది.

"ఈతలనొప్పి వొక్కటేనా నీబాధ ?"

"ఇంకేంలేదు—అదే నాప్రాణం తీస్తోంది."

చిరునవ్వు నవ్వాడు.

"తలనొప్పి కుదురుస్తాననుకో. ఇంక బాధలుండవా ? తరువాత?"

"వుండకేం ? మానవజన్మ మెత్తింతరవాత వుండకండా వుంటాయా ? అప్పుడు చూసుకుంటాను వాటిసంగతి."

అవును. మానవజన్మమే బాధ—ఒకటి పోతే ఇంకోటి, ఒకటి లేకపోతే యింకోటి. అసలు బాధలేని వుపాయం, కనిపెట్టాలిగాని—"

"అసలు బాధలేని వుపాయం ఏముంది ?-చావుతప్ప"

"చస్తే బాధలుపోతాయా ? పోతే అందరూ చత్తురు, కాని వొకటే సాధనం-"

"అది-"

"ముక్తి."

యోగుల చిట్కాలలో నమ్మకమున్నా ,వాళ్ళమహిమల్లో మంత్రాలలో నమ్మకంలేదు నాకు. అందులో ముక్తి స్వర్గం అంటే, ముసలమ్మ కబుర్లలాగుంటాయి.

"ముక్తి అంటే—"

"ముక్తి అంటే—జన్మరాహిత్యం"

"ఈ తలనొప్పులతో, యీబాధలతో, దారిద్రంతో అన్నిటితోటి కూడా జీవితమంటే నాకు చాలా మధురంగావుంది. జీవితం లేకుండా

శూన్యం తలుచుకుంటేనే నాకు భయం కలుగుతుంది, నాకు జన్మ రాహిత్యం వొద్దు,"

నవ్వాడు—పెద్ద వుపన్యాసానికి తయారవుతున్నట్టు కాళ్లూ వేస్తూ సర్దుకున్నాడు. నా తలనొప్పి కుదురుతుందనే ఆశలు అడుగంటుతున్నాయి పైగా అర్ధరాత్రిదాకా, యీ వేదాంతోపన్యాసం పట్టుకుందే, వొదిలించు కోడం యెట్లానా అని ఆలోచించాను.

"నీకు జన్మరాహిత్యం వొద్దుగాని, ఏంకావాలి ?"

"అన్నీ కావాలి, ధనము, కీర్తి, ఆరోగ్యం, అధికారం"

"ఇవన్నీ యెందుకు నీకు ?"

"అవంటే నాకు యిష్టం."

"ఎందుకు యిష్టం ?"

"వాటివల్ల నాకు ఆనందం."

"కనుక నీకు కావలసింది ఆనందం—వీటన్నిట్లోనూ కావాలి.

ఒకటే సూత్రంవుంది—ఆనందం తిండిలో, నిద్రలో, అధికారంలో అన్నిటిలోనూ ఆనందమే ప్రధానం-కాని కొన్ని చిన్నఆనందాలు, కొన్ని గొప్పవీ, కొన్ని క్షణికాలూ, కొన్ని దీర్ఘాయీ-కాని అన్నిటిలోనూ కలసి మిశ్రమములై బాధలూవున్నాయి. అనంతమైన, అత్యున్నతమై, బాధారహిత మైన ఆనందాన్ని ముక్తి అంటాము—కడుపునొప్పి వెగటూలేని తిండీ; భయములేనికీర్తి; అధికారమూ; అలసటలేని మైథునమూ; విసుకులేని రాగమూ-యివన్నీ కలిసి యింతేకాదు. నీ మనసుకు అందని అనేకకోట్ల సౌఖ్యాలు ఏకమైన ఆనందం ముక్తి.

"ముక్తి ఆనందమా ?"

"అంటే జన్మరాహిత్యంకాదూ ?"

"అవును. జన్మరాహిత్యమెప్పుడవుతుంది ? పరమాత్మలో ఐక్య మైనప్పుడు. ఆ ఐక్యం కావడమే, నిరంతర అవ్యయానందం, ఆ లోకంలో కూడా ఆనందం అంటే ఐక్యం-పువ్వుల వాసనతో, రంగుల కాంతితో.

ఐక్యం కావడం ఆనందం, వీటికన్నిటికి కారణమైన పరమాత్మతో ఐక్యం కావడం ముక్తి. జీవాత్మా, పరమాత్మా సంయోగం."

"యెట్లా అది పొందడం ?"

"అసాధ్యం. ఎట్లా పిల్లవానికి స్త్రీ వాంఛ అసంభవమో అట్లానే మీరంచరూ పిల్లలు-యీవిశ్వంలో. ఆ యౌవనం పదేళ్ళలో వొస్తుంది. ఈ యౌవనం పది యుగాల్లోకూడా రాదు—"

'ఐతే ఎందుకీ ఉపన్యాసం ?'

అన్నాను వొళ్ళుమండి,

'తొరగా ఎదగమని చెపుతున్నాను.'

'ఎట్లా ?'

'ముందు రాబోయే మహదానందం అనేకరూపాల మీకు ధ్వనిస్తోనేవుంది. ఈ పరమాత్మకీ. జీవాత్మకీ సంయోగంలోవుండే మాధుర్యం- జీవాత్మకీ. జీవాత్మకీ సంయోగంలో కనపతుతోంది. అదేప్రేమ- ఆ ఆత్మలు నివసించే దేహాల సంయోగంలోవుంది ఆ మాధుర్యం. తలుచుకో- ప్రతినరమూ, ప్రతి అవయవమూ. ఆవేశంతో వొణికిపోతూవుంటే. మనసూ ప్రాణమూ ఏకాగ్రమై, ఐక్యమైపోయే సమయంలోని ఆనందం అదేముక్తి. కోరెకలు, తలపులు. భావనలు, అన్ని యింకో వ్యక్తితో ఐక్యమైన ప్రేమని తలుచుకో అదేముక్తి. అది కొన్ని నిమషాలే. లభ్యమౌతుంది జీవులకి. కాని పరమాత్మలో ఆ అనుభవం అనంతమౌతుంది. అన్ని అనుభవాలలోకీ శ్రేష్టమూ, అప్రమేయము, సంయోగం అది సృష్టికర్తచెందే అనుభవము. ఇంకోనూతన ప్రాణిని కల్పించే ఆనందం-"

"ముక్తిసాధన అదేనా ?"

"సందేహంలేకండా. ఆత్మవికాసమే ముక్తిమార్గం. యోగం, జ్ఞానం, కర్మ. భక్తి అన్నీకూడా ఆత్మవికాసానికే సాధనాలు. ఈ ప్రపంచంతో ఎంత ఐక్యమైతే అంత ఆత్మ వికాసం కలుగుతుంది. ప్రపంచమంటే సృష్టి. సృష్టి శరీరాల ఐక్యంవల్ల కలుగుతోంది.ముక్తి అంటేఐక్యం

ముక్తివల్ల సృష్టికల్గుతోంది. సృష్టి మళ్ళీ ముక్తిపొందుతోంది. ఈ నదులు పర్వతాలు వృక్షాలు, జంతువులు మనుషులు, అందరూ నీవే అనే ఐక్య భావం రావాలి. ఈభావం ప్రతివాడికీ సంయోగంలోని రెండు నిమిషాల లోనూ తోస్తోంది. అవునా కనక ఆకార్యంలో ప్రతి వ్యక్తీ ముక్తిని రుచిచూస్తున్నాడు. ఆత్మవికాసానికి ముఖ్యసాధనం సంయోగం—ఏ వ్యక్తి ఆజాతి వ్యక్తితో ఎంతమందితో, ఎన్ని విధాల సంయోగం పొందుతాడో అంతముక్తికి సన్నిహితుడౌతాడు."

'మరి పాపమంటారు ?'

'అంటారు—పాపమేమిటి ? ఆత్మవికాసమే ముక్తి. పాపం యీ మూర్ఖులకి. వాళ్ళకి ఆనందం తెలుసా ? వృక్షాలకి తెలుసు. కీటకాలకు అంతకన్న ఆ ఆనందంతెలుసు. జంతువులకి యింకా కొంత. మనుషులకి అధికానందముంది దాంటో. అందులో రసికులూ ఆత్మౌన్నత్యం కలిగినవాళ్లూ పరిపక్వం చెందిన వాళ్లూ, ఇంకా అతీతమైన ఉన్నతావస్తను పొందుతారు. క్షుద్రులకు ఆఆకర్షణే వుండదు. పశుప్రాయులు వాళ్ళకి ఆత్మ వికాసంలేదు. ఒకటే వ్యక్తి అనుభవంతో—ఏ జంతువైతేనేందాంతో తృప్తి పడతారు. ఆత్మయెప్పుడూ ముక్తికోసం బాధపడుతుంది—పరమాత్మ పిలుపునువిని రెకలు కొట్టుకొని విజృంభించడానికి ప్రయత్నిస్తుంది—ఈశ్వరుడు సౌందర్యమూర్తి, సౌందర్యమంతా యీశ్వరుడు. సౌందర్యమే ఆనందం—సుందర తేజం, సుందరధ్వని, సుందరరసన — సౌందర్యాన్ని గుర్తించి అన్వేషించి వాంఛించనివాడు అధముడు—సౌందర్యంతో—వివిధ రూపాలు, వివిధములైన మార్పులుపొందే, సౌందర్యాన్ని అనుభవించడంలోనే ఆనందం—ఇంతకన్న ఆనందదాయకమైనది ఆ ముక్తిమాత్రమే ;

ఎంతరసికుడో, యెంత సౌందర్యోపాసకుడో మనిషి, అంత యీశ్వరప్రియుడు—ఎంత అనుభవాన్ని వాంఛిస్తాడో, ఎంత సంయోగాన్ని పొందుతాడో—అంత యీశ్వరుణ్ణి ప్రేమిస్తాడు—ఎన్నివిధాలైన సౌందర్యంతో — ఎంతమంది వ్యక్తులతో ఐక్యమౌతాడో—యెంతమంది

స్త్రీలను ప్రేమించి కామిస్తాడో అంత ఆత్మవికాసం పొందుతాడు—

దిగ్భ్రమచెంది కళ్ళు తెరిచాను.

యోగి అంతర్థానమైనాడు-నాతలనొప్పితో సహా-

నా చుట్టూ ప్రపంచమంతా వెన్నెల్లో ముకుళించుకు పడుకుంది. నా హృదయంలో నూతన జ్ఞానజ్యోతి వుదయించింది.

# ఎరికలమ్మ

స్కూలుకి ఆలిస్యమయిందని తొందరగా సైకిలు తొక్కుకొని పోతున్నాను. మధ్యాన్నం గుంటూరు రైలుస్టేషన్ Refrshment rooms లో టీ కప్పుముందు పెట్టుకుని ఆలోచనలో పడితే యెంత కాలం గడిచి పోతోందో తెలీదు. ఆలిస్యంగా వొచ్చానని, చిరునవ్వుతో నా మొహంవంక చూసేసాహేబు హెడ్మాస్టర్ని తలుచుకుంటేనే వొళ్లు కంపరమెత్తుతోంది. కోప్పడే వాళ్ళనీ, నోటీసులు పంపేవాళ్ళనీ, గొణుగు కొనేవాళ్ళనీ, వూరుకునే వాళ్లనీ భరించవొచ్చునుగాని తప్పు జరిగినప్పుడు చిరునవ్వు నవ్వే డెవిల్ని భరించడం కష్టం.

నా Old horse ని spur చేస్తూన్ననేను. చప్పున కళ్ళెం బిగించి ఆపాను. ఆస్పత్రి గోడపకరీన ఒక ఆమె నించునివుంది. ఏదో జ్ఞాపకం తళుకురీమంది మెదడు వెనకాల ఎక్కడో. సైకిల్ దిగి నిదానించి చూశాను. అందమైన ఆడదాన్ని చూశానా గడ్డం హెడ్మాస్టర్లు వెయ్యి మంది, లక్ష చిరునవ్వులునవ్వనీ. నా కేం లక్ష్యం ? "నువ్వా" అన్నాను దగ్గరికి వెడుతో. ఆమె చదువుకున్న ఆడదైతే, ఒకా నొకప్పుడు నేనెంతబాగా ఎరిగిన మనిషైనా చనువుగా పలకరించేముందు సంకోచింతును. చుట్టుపకరీల ఎవరున్నారో ఆమెచూపు యెట్లావుందో, అన్నీ ఆలోచించాలి. కాని ఎరికలదేగా! "నువ్వా" అనడానికికూడా నాకు కారణంగాని, అధికారంగాని, లేవు. కాని అధికారంలేని పనులన్నీ

మానేసి బతకగలనా, ఈహృదయం నశించిపోదా? లోకమిచ్చిన అధికారాలు వొదులుకున్నాను. లోకం వొద్దన్న అధికారాలు కావాలని పోట్లాడతాను. అదేగా నా జీవితచరిత్ర. ఆస్పత్రి గోడపక్కన, యెండలో, తాటాకు బుట్టచేతపట్టుకుని నుంచుని వుంది ఆమె.

ఎరగనట్లు, నిదానంగా నావంకచూసింది ఒక నిమషం. మళ్ళీ ఎకరాడానికి గుణ్ణాన్ని తట్టుతున్నా. ఇంతలో ఆమె కళ్ళలో జ్ఞాపకం వెలిగించి. జాలిగా దిక్కులేనట్టు చూస్తున్న నల్లని మొహంమీద నవ్వు కమ్మింది, అర్ధరాత్రి చంద్రోదయమైనట్టు. నిదానించి ఆలోచించి 'అల్లరిదాన్ని' అన్నది సిగ్గుతో, క్షమించమని కళ్ళు అడిగాయి.

ఆలోపలే, ఆమె కడపట చేసిన అవమానం నాకు జ్ఞాపకంవొచ్చి, సైకిలుదిగి పలకరించినందుకు సిగ్గుపడుతున్నాను.

మోటారులో రోడ్డు వెంట యింజనీరుగారు వెడుతున్నారు. టీపార్టీలో నన్ను కలుసుకొని, ఏ గాలివల్లనో, స్నేహం చేసుకుని, రెండు మూడుసార్లు యింటికి రమ్మన్నారు. అఖరు, యీనాటితో యింక యింజనీరుగారు పెడ మొహం పెడతారు. ఆయన స్నేహానికి నీళ్ళు వొదిలాను, ఆ వేడిరోడ్డు పక్కన, ఆస్పత్రి గోడ కింద తాటాకుబుట్ట పట్టుకునించున్న యెరికల మనిషితో చనువుగా మాట్లాడేవాడికి క్లబ్బు గతులున్నాయా?

ఆ ఇంజనీరే అట్లారాకపోతే, నేను సైకిలెక్కి వెళ్ళిపోయే వాణ్ణేమో! ఇంకా యెవరైనా యింజనీర్లు రానీ? వాళ్ళ తల్లీ భార్యల్నీ రానీ, చూడనీమని ఆమెకి యింకా దగ్గిరగా వెళ్ళేను.

"ఇక్కడికి యెట్లా వొచ్చావు?"

"ఆవూరూ యీవూరూ తిరుగుతూ."

నే నామెని మొదటిసారీ చివరిసారీ చూసింది ఒక మధ్యాన్నం గంటసేపు పెన్నదగ్గిర.

అది ఏప్రిలు నెల నెల్లూరులో. ఎన్నాళ్ళకీ సూరీలు ముయ్యరు. నేనున్న కొత్తయింట్లో స్నానానికి వీల్లేదు, ఏమంటే, పక్కనేగా పెన్న

అన్నారు. పకఠానే పెన్న యిసిక ! పెన్ననీరుకాదు. కొవ్వూరు వెళ్లాలి నీటికోసం. కొవ్వూరుదగ్గిర పెన్న చైత్రంలో పధ్నాలుగేళ్ళ పిల్లలా గుంటుంది. కల కల మని పరుగెత్తుతుంది. ఎండలో మెరుస్తుంది. పిచ్చిగా వెచ్చగా వుంటుంది. చిన్న చిన్న అలలు మాట్లాడితే మెలికలు తిరుగుతుంది. గంభీరమైన గోదావరి యీతలతో నదీజీవనం ప్రారంభించిన నాకు, యవ్వనవతి కృష్ణలో ఆటలాడి, చివరికి యీ పెన్నతో చిక్కులు పడాల్సి వొచ్చింది. కాలం గడిచినకొద్దీ పెన్నమీదే ప్రేమ ఎకుఠవైంది; ఒక పెన్నమీదే కాదు.

కొవ్వూరి వొడ్డున పెన్న అనేక పాయలు. పాయల మధ్య చిన్న చిన్న యిసిక లంకలు. పగటి ఎండ వేడి అంతా పోయ్యేట్టు వోపికగల మనుషులు రెండు మైళ్లూ నడిచి వొచ్చి, తలొక పాయనీ కావిలించుకొని పడుకుంటారు. రెండుచేతులూ చాపితే పాయ అంతా రొమ్ముకింద యిమిడ్తుంది. పెన్న అలలు వీపు చుట్టూ అందుకోలేవు. తాపం పోవడానికని ఆ పాయ మీద ఇటూ అటూ దొర్లుతారు రసికులు. అందులో ప్రత్యేకం ఒక నీలపు పాయను నేను అధీనంలో ఉంచుకున్నాను. నా కన్న పెంచ రాశే యెవడన్నా దాన్ని ఆక్రమించుకున్నాడా మండిపడతాను. కాని ఆ పాయ మీద నాకేమి అధికారముంది? ఆ పాయ కిష్టమై ఆ మనిషి కిష్టమైతే నాకెందుకని యింకో పాయకి పోతాను. కాని ఆనందంలేక, తిరిగివొచ్చి ఆపాయనే పంచుకుంటాను రెండో వాడితో. నా అంతటి వివేకమే అందరికీ వుంటే యెంత బావుంటుంది లోకం?

ఆరోజు సాయంత్రం. నది మొదటి పాయ వొడ్డున యిద్దరు కనపడ్డారు, ఓ కుర్రాడు ఓ కుర్రదీ. కుర్రాడు యెఱ్ఱని నలుపు. ఆమె చిరిగిపోయిన బట్టముకఠవిడిచి అంతకన్న పేలికలుగావున్న వస్త్రం ధరిస్తోందిషోకుగా. ఎంతలాగినా బుజంమీద రెండో కొన నిలువదు పొడుగు; ఎంతపరిచినా రొమ్ము రెండుచివర్లనీకప్పదు, వెడల్పు. నవ్వాలో దుఃఖించాలో తోచలేదు.

అతను యానాదిమనిషి చూపుపెట్టి లోకంతో సంబంధంలేనట్టు నుంచున్నాడు. నన్ను ఆమెచూసింది. విడిచినబట్టని తీసుకొని నదిలో దిగింది. అతను ఒడ్డున యిసికమీద కూచున్నాడు. ఉతకడానికి వొంగే టప్పటికి ఆచిన్న పమిట కిందికిపడ్డది. నావంక చూసింది. పకపకా నవ్వింది. ఆ నవ్వుకి నాలుగిందాల అర్థం కనపడ్డది. నా నార్థాలు బోధించే వుపాధ్యాయుణ్ణి కనక గాబోలు. లాభంలేదని ఒదిలేసి బట్టవుతుకుతోంది. నాకు ఆమె శరీరాన్ని చూడ్డం చాలాసుఖంగావుంది. ఆమెకేమీ లక్ష్యం లేదు. ఆ మొదటిచూపు తరవాత ఆమెనన్నే మరిచిపోయినట్టుంది. నేనుంచున్నా వొకటే ఉక్క నుంచున్నావొకటే ఆమెకి. బుద్ధిలోకూడా భేద మాత్రే లేదనిపించింది నారు, అందువల్లనే నేనీ కథ వ్రాయడమూ నా సోదరులు చదివి ఆనందించడమూ కలిగాయి అనుకోండి,

చక్కని ముకురి. పల్చనీ ఎడమచంపమీద సూర్యుడు నిగ నిగ మంటున్నాడు. నాకు కనబడే యెడమరొమ్ము యెడమప్రకరి చర్మం సాగడం మూలంగా తెల్లగా ఉంది, ఆనీళ్ళలో తలయెత్తే చిన్నయిసిక తిన్నెవలె.

నేను చెప్పులు విడిచి, నాపాయని చేరుకుని, పడుకున్నాను.నా శరీరం నీళ్ళలో-నాకళ్ళు అకురదానిమీద, పెన్నకాగా సహించింది, గోదావరైతే ఒకరితన్ను తన్ని ఒడ్డుమీద పారేసును. లేకపోతే ఒక్క మునక ముంచి, ఇంక చూపులు లేకుండా చేసును.

బట్ట ఒడ్డున ఆరేసింది. నీళ్ళలోదిగింది. అతనూ దిగాడు. వెల్లకితలా పడుకుని, ప్రక్కన కూర్చున్నఅతనిమీద నోటిలోనుంచి వీళ్ళు చిమ్ముతోంది, చేపవలె కొట్టుకొని, అతని కాలు లాగుతూంది. గిలాగిలా కొట్టుకుని, జారి, పైకి లాక్కోమని చెయ్యి అందిస్తుంది. నవ్వుతుంది. అరుస్తుంది. అతన్ని చరుస్తుంది, రెచ్చకొడుతుంది. దూరంగా పాకుతుంది. పిల్లిలాగు పొంచి దూకుతుంది. ఇసికి ముద్దలతో కొట్టింది. గులకలు విసిరింది. అతను కదలడు. అట్లా ఆనందంగా

చూస్తోకూచుంటాడు కళ్ళు ఆమెకి వప్పచెప్పి. ఏమిటి గోల అని చిన్న పిల్లవంక చూశేట్టు చూస్తాడు. మళ్ళీ ఆమెకన్న వయస్సులో చిన్నవాడుగా కనిపిస్తాడు. శరీరం అంత చిన్నదిగా వున్నా ఆమెమొహంలో పాతికి ఏళ్లున్నట్టు కనపడ్డాయి. ఆ అల్లరేమీ అతని కిష్టంలేదనీ ఆమెమీద ప్రేమచేత భరిస్తున్నాడనీ అనిపించిందినాకు.

మా కుకరాలు జాన్, జిమ్మీ జ్ఞాపకం వొచ్చాయి. జిమ్మీఆటలమారి జాన్ని పీకి, కొరికి ఆడుకోమని అరిచి, ఇటూ అటూ దూకి గోల చేసింది, జిమ్మీమీది ప్రేమవల్ల జాన్ కదలక నుంచునేవాడు. అరవక, కరవక, [అవునా కాదా వాణీ!]

అల్లరంతా కానిచ్చి, మెల్లిగా ఆమెని పడుకోపెట్టి ఇసికతో ఒళ్ళంతా రుద్దుతున్నాడు. చిరునవ్వుతో అతని మొహంవంక చూస్తో, రాణీలాగు పడుకుంది. రాణీల పడకలు ఆ యిసికకన్నా ఖరీదు గలవేగాని సౌఖ్యం కలవా? వాళ్ళిద్దరి తన్మయత్వాన్నీ చూసి నేను తీవ్రంగా యీర్ష్యపడ్డాను. బ్రతుకు అట్లా ప్రేమలో లీనమై, నన్ను నేనే మరిచిపోగలిగితే, ఈ చదువులూ, పరీక్షలూ, వండడాలూ, భోజనాలూ, నగలూ, పుస్తకాలూ, కార్లూ, ఇన్స్పెక్షన్లూ, కుర్చీలూ, హెడ్మాస్టర్లూ—

అది ప్రేమేనా? కవులుపాడే ప్రేమ అదేనా? అనుకున్నాను. వాళ్ళకా కామమూ లేదు, పశుత్వమూ లేదు ఆ నిమిషాన. ఆమెది సన్నని వొళ్ళు, ఒక్కతులం కొవ్వులేదు యెకరాడా, యెటూ వొంచితే అట్లా వొంగేట్టు యెట్లాచాచితే అట్లా సాగేట్టు కనబడుతోంది. జింకవలె యెగురుతుంది. ఇటూ అటూ ఆడి అతని మొహం వంకచూసి "ఊ" అని కంఠంలోంచి ధ్వనిచేస్తే 'గ్రైటాగార్బో' యీమెనించే నేర్చుకుందా అనిపించింది. ప్రేమ ఎవరికన్నా ముఖంలో కంఠంలో మాధుర్యం తెప్పిస్తుందికదా! చివరికి వేసవికాలంలో బనారసుచీరెకింద, వంటింటి పకరాగదిలో, పందిరిపట్టె మంచంమీద, చెవులో బండ గోపికలపటం కింద గర్భాదానం జరిగే చిలిమిడి ముద్ద కన్యకికూడా—చివరికి.

గొప్ప అభిప్రాయాలూ, ఆత్మలు కలవడాలూ. మనోభావాల ఐక్యం పాతివ్రత్యం ఇవేమీలేనేలేవు. అట్లాంటి నాన్సెన్సేలేదు. ఇద్దరి మధ్యా యవ్వనమూ, ఆరోగ్యమూ, యిష్టమూ, యింకేంకావాలి ? నిన్నలేదు. రేపులేదు. ఆస్తిలేదు. హుహులేదు. ఆనందమంటే వాళ్ళది.

ప్రియురాలి కళ్ళలోకిచూస్తే ఆత్మవున్నదాలేదా, అని యోచించే నాకు ఆనందమేమిటి, ఈ లోకంలో.

తోకలేనికొంగ చేపలకోసం దేవుళ్లాడుతోంది. సూర్యకిరణాలతో మెరుస్తూ లేత అలలు యిసికమీద ఆడుకుంటున్నాయి. ఆనకట్ట చివర ఒకడు పడిపోయినట్టు ఏమి బావుకుందామనో సైకిలెక్కి పోతున్నాడు. వేగంగా. అధికారి ఎవడో తనదర్జాకీ అదృష్టానికీ పొంగుతో మోటారులో ఊరేగుతున్నాడు తనిఖీలకి. ఆనల్లనిపిల్ల వీపుని నల్లనివాడు రుద్దుతున్నాడు యిసికతో. పిల్లలిద్దరూ ఆడుకుంటున్నారు పెన్నవొడ్డున.

ఆమె రొమ్ము రుద్దాడు, తొడలు రుద్దాడు, నేనుచూస్తున్నా అని కూడా తలయెత్తిచూడలేదు. అతనికళ్ళల్లో కించిత్ మార్పులేదు నేను ఆమెస్త్రీ అని మరిచిపోయాను. అతనూ మరిచాడు. మొగుడూ పెళ్ళామేనా. ఎంత కాలం వుంటుంది ఈ ప్రేమ, వాడింకేం చేస్తాడు. ఇట్లాంటి పవిత్ర ప్రశ్నలేమీ తట్టలేదు. అద్భుతమైన కవిత్వం చదువుతున్నట్టుంది. కదలకండానే అట్లా పడుకున్నాను తన్మయుణ్ణయి, వాళ్ళ ఆనందంలో నాస్తితిని నా వునికిని నేనే మరిచి;

మెల్లిగా యెంకిపాటలు జ్ఞాపకం వొచ్చాయి. పాపం, సుబ్బారావు గారినీ అట్లానే అన్నారు. ఆయన 'ఎంకి'కి పెట్టిన భావాలు అసహజంఅంట చదువుకున్నవారికిగాని ఆ ఆలోచనలు వుండవుట. పుస్తకాల్లోంచి మాత్రమే జ్ఞానమూ, వేదాంతమూ, రసికత్వమూ, తెలుసుకోడం బాగా అలవాటై ఆ పుస్తకాలు చదవనివాళ్ళకి ఆ జ్ఞానమే రసికత్వమే వుండదని వాళ్ళవాళ్ళ అభిప్రాయం. చదవనివాళ్ళకి వున్నాయో లేదోగాని, ఈ చదివినవాళ్ళకి నే నెరుగుదును, పుస్తకాల్లో, నాటకాల్లో, సినిమాల్లో తప్ప దేవుణ్ణిగాని,

స్త్రీనిగాని, బిడ్డనుగాని గొడ్డునుగాని, ప్రేమించేశక్తి పూర్తిగా నశించింది. వీరిజ్ఞానమంతా ప్రేమించిన ఇంకోడు బొమ్మలువేసి చూపవలసిందే. తోటలో ఒక గంటసేపు రమ్యంగా తిరగలేరు. ఆ తోట అందంఅట ఫొటో యెత్తితేగాని, కనపడదు. రోజూ సూర్యోదయ సూర్యాస్తమానాలు అద్భుతంగా నెత్తిమీద జరుగుతూవుంటే కళ్ళుమూసుకుని; సినిమాలో సూర్యోదయం చూపితే అరనిమిషం వూపిరిబిగపట్టి ఆనందిస్తారు. ఈ యిద్దరివంటి ప్రియులు ఆడుకుంటోవుంటే కసిరి అవతలకిపోయే ఛాందసులును, సులోచన వెయ్యిమాట్లు స్టడీచేసి ఫొటో తీయించుకున్న చూపును పావలా పెట్టి కొని చప్పరిస్తారు. మొగవాడు స్త్రానం నరసింహారావు 'హా కృష్ణా' అని వెనక్కి విరుచుకుంటే యీ పురుషులందరూ, 'హా' యని ముందుకు వొంగుతారు.

నేను తుడుచుకుని, పాయలు దాటి వొచ్చేటప్పటికి ఆమె స్నానమై ఆరినబట్ట కట్టుకుని, తన బట్ట వుతుకుతుంటున్న అతనితో ఏదో చెప్పి నవ్వుతోంది. వాళ్ళదగ్గిర నేను విడిచి వెళ్ళిన చెప్పుల వంక చూసి నవ్వుతున్నట్టుంది. చెప్పులు చకచనివే, నవ్వెందుకు ? ఇట్లా అనుకున్నాను.

"ఆయన వొచ్చేలోపున ఈ చెప్పులు తొడుక్కొని నువ్వు పరుగెత్తు" నీ గోచీతోసహా. ఆ గోచీ, ఈ చెప్పులు ఎట్లా వుంటావు రాజకుమారుడిలాగ ! హహహ ఆయనేంచేస్తాడు, ఆ తడిలాగుతో నీ వెంట పడతాడు. పడనీ, ఆసంచీయెత్తుకుని నేనిట్లాపరుగెత్తుతా? ఏంచేస్తాడేం ? ఎవరూ లేరులే చెప్పుల్ని ఆ డొంకలోవిడిచి నువ్వుపో, సంచి ఆగట్టు మీద పారేసి నేవొస్తా." అంటోందేమో !

నేను వాళ్ళదగ్గరగా వొచ్చి, చూస్తో నించున్నాను. అతను బట్ట వుతుకుతున్నంతసేపూ ఆడింది, నవ్వింది. గంతులేసింది. పాడింది. నాకు వొకమాటా అర్థంకాలేదు. ఒకొకటికటి పోజ్ ఎంతో అందమనిపించింది నాకు ! ఎకరెణ్ణించి వొస్తోంది. ఆ సంతోషం ఆకవిత్వం, ఆమధురమైన వొయ్యారం ! అతను తడిబట్ట పిండుకుంటున్నాడు. ఇద్దరూ

వూరివేపు ప్రయాణమైనారు. ఆమె వెనకిగా తగ్గింది. నావంక తిరిగి చూస్తోంది దొంగతనంగా! వాళ్ళనే యింకా చూస్తూన్నట్టు, కనపడడం సిగ్గేసింది నాకు. ఆమె కిందికి వంగి ఏదో యేరుకున్నట్టు కనబడి, నావంక చూసింది. నేను నదివేపుతిరిగాను. పెళ్ళుమని నావీపున ఇసిక పెళ్ళ పగిలింది. వెనక్కి తిరిగాను. నవ్వుతో పరుగెత్తుతోంది ప్రియుణ్ణి కలుసుకోడానికి. కోప్పడ్డానికీ, అరవడానికీకూడా దూరంగా వున్నారు వాళ్లు.

ఆమె వుద్దేశం ఏమిటి? కోపమా, ఇష్టమా, అల్లరా? పోనీ ఆగోల ఎందుకు? మళ్ళీ కనపడతారా యీమన్నానా? అనుకుని బైలు దేరాను. నాతోవ వాళ్ళ వెనకనే. శలవలకి మర్నాడు వూరికి పోతున్నాను. పెన్నకి గుడ్‌బై.

వాళ్ళకేసి చూశాను. దూరంగా ఆ యిసిక మైదానంలో ఆ పంచని చెరో చెంగూ పట్టుకుని ఆరేసుకుంటో పోతున్నారు. ఒక చెంగు స్తంభానికి కట్టినట్టుంది. రెండో చెంగు తూలుతుంది. వొంగుతుంది. ఎగుర్తుంది వూడి కిందపడుతుంది.

అదీ ఆమెని నేను చూచిన ఆనాటి సంగతి.

ఆగి పెన్నవంక చూశాను. శలవు. చిన్నఅందాలూ; ముద్దుముద్దు శబ్దాలూ, చాతగాని వేళ్ళతో కౌగిలింతలూ, పిట్టవంటిముద్దులూ అన్నీశలవు మళ్ళీ నేను వొచ్చేటప్పటికి పెద్దదవుతుంది. కాళి రూపం దాలుస్తుంది. ప్రచండమారుతంతో వరదలు విసిరికొడుతో వుంటాయి. తన తోవదాటే నరుల్ని పెద్దనాలుకలు చాచి కబళించి మింగేస్తోవుంటుంది. విడవలేక మెల్లిగా ఆనకట్టవేపు వెళ్ళేను. ఆనకట్టకింద మడి రేవులో మేము స్తానం చేసిన నీళ్ళు చేరుకునే గుంటలో, పారుదలేలేని ఆ మురికిలో, ముసలమ్మలు చెంబులు తోముతున్నారు. శ్రోత్రియులు మంత్రాలుచదివి స్తానం చేస్తున్నారు. ఈనాడు పావనమయింది మీజన్మ! ఆమెవీపు కడిగిన నీళ్లు ఆచమనంచేస్తున్నారు. స్వర్గంకావాలా మీకు? ఎకడవుంది స్వర్గం? నల్లని వీపుతోమే భాగ్యంలేని మీకు స్వర్గం ఏమిటి? మోక్షమా ఈ

మడినించి ఈచాద స్తంనించి ఈ మురికినీళ్ళనించి ఈ స్వార్థంనించి, ఈ నీతినించి ఎన్నటికి మీకుమోక్షం ? చల్లని గాలిలో, తెల్లని యిసికతో, వల్చని నీళ్ళలోకలిపి. వీపు రుద్దలేని మోక్షాలెందుకు ?

సూర్యడ స్తమిస్తున్నాడు. ఎఱ్రగా, ఒక మబ్బులేక, గంధం కడిగిన సింహాచల నరసింహస్వామివలె దర్శనమిచ్చాడు. నాలుగు నిమిషాలు, ఆనకట్టమీద పొయ్యే బళ్లు, గొడ్లు, మనుషులు, ఆకాశం తెరమీద 'సిలట్టీ' లుగా కనబడుతున్నారు. ప్రతి దేహాన్నీ ప్రేమతో కావలించుకుంటోంది దక్షిణపుగాలి, ఆయేటిమైదానమంతా కలిపితే యిరవైమంది లేరు. ఏం చేస్తోంది నెల్లూరు, వేలకొలది ప్రజలు ! కాఫీ హోటళ్ళలో, క్లబ్బుల్లో, సినీమాలలో గుమికూడారు. మూడురూపాయలకి రాత్రంతా లంభించే బుజంలోసగం, గాలికి బహిరంగమైనట్టు, అరనిమిషం ఫొటో తీస్తే దాన్ని చూసి తృప్తిపడడానికి- ఈవేసవికాలంలో మూడువందలమంది ఒకరి గాలి ఒకరు పీలుస్తో రేకులకింద చేరారు. కూరడబ్బులు గేటు దగ్గర వాళ్ళ కిచ్చుకుని. ఈ పెన్ననదిని వొదిలి 'రాణీప్రమీల'ను చూస్తున్నారు.

ఇదీ పాతకథ.

ఆనాడు ఆమె యిసికపెళ్ల విసిరిన సంగతి జ్ఞాపకంవొచ్చి సైకిలెకబోతో 'అతనేడీ '? అన్నాను.

ఆవ్వుత్రివేపు తల వూయించింది. కళ్ళలో నీళ్లు నిండాయి.

"జబ్బా !"

తలవూయించింది. "పాపం" అన్నాను. ఇంకే మనను ?

"ఎన్నాళ్ళుంటారు ?"

చప్పున ఏడ్చింది.

"అయిపోయిందాకా."

నవ్వులతో భూమినీ ఆకాశన్నీ నింపిన పిల్ల ఈనాడు నాముందు యేడవడం సహించలేక పోయినాను బుజంమీద చెయ్యేశాను. అవును

రోడ్డుమీదనే! నాకా యీ నాడు పోయేందు కేమీ మర్యాదలేదు. ఇక ఆమా_నగలులేవు చీరెలులేవు ఆమెకేం మర్యాద!

"డాక్టరు కుదరదన్నాడా? నేను వచ్చి డాక్టరుతో మాట్లాడనా?"

"పదిరూపాయలు కావాలిట."

"ఎవరికి?"

"డాక్టరికి. మందుకొని యెక్కించాలిట."

కొంగు కళ్ళకి అడ్డం పెట్టుకుని ఆపుకోలేక వెకిలి వెక్కి ఏడ్చింది. ఆ కదిలే రొమ్ము మీదికి వెళ్ళాయి నాకళ్లు. చీరె యిదివరకంత చిరుగులు గాలేదు కాని కొంగు కళ్ళదగ్గరికి లాక్కుంటే రొమ్ము పూర్తిగా కప్పే టంత విశాలమయినది కాదు. ఆంధ్రపవిత్ర నారీమణులవలె యెనిమిది గజాలు కొనలేరు పాపం ఈ బీదవారు.

"పెన్నదగ్గరకన్న కొంచెం అందం యెకువయింది కాని తగ లేదు." అనుకున్నాను, సిగ్గులేక. ఎంత ప్రయత్నించినా ఆగవు. ఈ చూపులూ, ఈ కోర్కెలూ, పుటకతో వచ్చాయి. "సాయంత్రం మా యింటికి రా—"

ఆ మాటలు నేను అనడానికి కారణమేమిటి? ఆరొమ్ముమీద కలిగిన ఆనందమూ, ఆ రొమ్ములో కలిగిన దుఃఖమా? రెండూనేమో! మానవ స్వభావం అగాధమయినది

సైకిలెక్కి వెడుతున్నాను. "ఇల్లెకడ" అన్నది. దిగి, చీటి వ్రాసి యిచ్చాను. ఆమె వంకచూసి, "తప్పకరా" అన్నాను. స్కూలులో జాగ్రఫీచెపుతున్నాను; పిల్లల్ని తిట్టుతున్నాను, మేస్టర్లతో సణుగుతున్నాను. అదే ఆలోచన. కళ్ళముందు ఆమెదే రూపం. పది రూపాయలు! బీదవాణ్ణి. మరదలు పెళ్ళి అవుతోవుంటే మొన్న కట్నా నికి డబ్బులేదు పొమ్మన్నాను. మామ నాకు జరపని లాంఛనాల సంగతి దెప్పిపొడిచి. ఆ పదిరూపాయలతో ఆగుతుందో, మెల్లిగా, ఇంకా లాగు తుందో?

ఆమె అడగలేదన్న సంగతి మరిచేపోయినాను.

పదిరూపాయలు! రెండురోజుల జీతం. ఏమిటిలాభం నాకు? ఈ లోకంలో ఓ ఎరికిలాడు చస్తేనేం బతికితేనేం? ఆమెకోసమా! ఏమిస్తుంది? ఇస్తే! తీరా యియ్యకపోతే! అతనిమీద ప్రేమ సంగతి ఏంచేస్తాం?- కాని ప్రేమవుంటేనేం, ఎంతమందో!

"ముందే కండిషన్ పెట్టు" అంది ఒక చిన్న డెవిల్ నా చెవిలో

"వీలైతే చూస్తాను" అన్నాను డెవిల్‌తో.

డాక్టర్ దగ్గిరికి వెళ్ళి కనుక్కుని ఆమె కథ అబద్ధంకాదని రూఢి చేసుకున్నాను. నా జాగ్రత్తకి నేనే సంతోషించాను. పూర్వం స్త్రీ కన్నీరు చూస్తేచాలు 'ఏంకావాలి, నామానమా ప్రాణమా? ధనమా, కాలమా?' అనేవాణ్ణి. ఆప్రకారం స్త్రీల క్షణికమైన whims కి బలిఅయి, మోసపోయి సిగ్గుపడి; కొంచెం బ్రూడెన్సు పాఠాన్ని నేర్చుకున్నాను.

నేను ఇంటికి వెళ్ళేటప్పటికే ఆమె అరుగుమీద కూర్చునివుంది. ఆమెనిచూసి,దిక్కులేనట్టు అట్లాపడివుండడమూ, బిచ్చగత్తెవలె వీధిమీద కూర్చోడమూ, రేగినజుట్టూ, అముతక చీరా, చూసి, మధ్యాహ్నం అంతచనువుగా ఎట్లామాట్టాడేనా అనిపించింది. మర్యాద, ఆచారమూ ఇవిచుట్టూగాలిలో ప్రాణవాయువువలె కలిసి కాచుకునివుంటాయి. రోజూ మనస్సుని అవి వదలిపోయేట్టు తోచకపోతే. రాగిపాత్రవలెPoisonous compounds form అవుతాయి.

లోపల కోటు తగిలిస్తోవుంటే ధర్మపత్ని 'ఎవతో కొత్తదిపచ్చి కూచుందే వాకిట్లో,' అంది నవ్వుతో. నేను మర్యాదగా తక్కిన భర్తల వలె బ్రతుకుతానని కీర్తి సంపాదిస్తాననే ఆశకి యెప్పుడో నీళ్ళు వదులు కుంది. డబ్బున్నా కొంచెం జాగ్రత్తపడతానేమో యెన్నటికన్నా అని ఆశ యింకా పోలేదు. ఆమె చూడకండా పదిరూపాయల నోటు చేబులో పెట్టుకుంటూవుంటే, ప్రొద్దున్న ఆమె బీరకాయలు అరవీశ, రెండు కానీల పమ్మేడీకి బేరమాడడం జ్ఞాపకంపచ్చింది. ఎప్పటికో కాసులపేరు చేయించు

కుందామని ఆమె ఆశ.

అరుగుకింద నిద్రపోతూన్న కుక్కమీదనించి పిల్లలు లాంగ్‌జంప్ చేస్తున్నారు. ఎదిరింటి కప్పుమీద కాకులు వరసగా కూర్చున్నాయి. కొబ్బరి చెట్టు ఆకు చివర్లు ఎండలో మెరుస్తున్నాయి. ఆమె లేచి నించుంది. నా ఆలోచన అంతా బేరం ఎట్లా 'గ్రేస్‌ఫుల్' గా చేద్దామా అని. ఆమె కళ్ళలోని ఆశని భరించలేక, ముఖం తిప్పుకుని, విసుకుగా 'ఇక్కడ వీల్లేదు. ఆస్పత్రి దగ్గరవుండు వస్తాను' అన్నాను కఠినంగా. ఇట్లా తిప్ప డంకూడా ఒకందుకు మంచిదే ననిపించింది. హృదయంలోని కోర్కె ఎన్నిచిగుళ్లు పెట్టింది. అసహ్యమైన మాటలు, ఫీలింగ్సు, రేపింది! నావంక బికారిమొహంతో చూసి 'నిజమేనా?' అంది.

"నిజం, వెళ్ళు."

కాళ్ళీడ్చుకుంటూ వచ్చినదోవనే పోతూంది. నేను సైకిలుమీద క్లబ్బుకి వెళ్ళి, లైమ్‌జూస్ అనే పేరుతో అణాతీసుకొని వాళ్ళిచ్చే వేపాకురసం తాగి ఆంధ్రపత్రికలో, ఆ ప్రముఖులు దేశానికిచ్చే తెలివైన సలహాలను చదివి ఆనందించి, ఆస్పత్రి గోడ దగ్గిరికి చేరుకున్నాను. దీపాలు వెలిగిస్తూ వెడుతున్నాడు నిచ్చెనమనిషి గొప్పవారిపేరు, గొప్ప గొప్ప గోతులు కల రోడ్డు దుమ్ములోనుంచి తప్పించుకొని కంచకం ప్రకాన విలుచున్న ఆమెని చేరుకున్నాను. బేరానికై హృదయాన్ని గట్టిచేసుకున్నాను. మరి నా హృదయంలో మధ్యాహ్నంనుండి పేరుకున్న మర్యాద మహాత్మ్యమో లేక ఏపనినైనా అనుమానాస్పదంగా చేసే గుణం ఆ చీకట్లోనేవుందో, ఆమెతో మాట్లాడడమంటే ఆమెతో కలిసి నిలుచోడమంటే సిగ్గుపడుతున్నాను. రాగిచెంబు చిలుముపట్టింది.

"తీసుకొచ్చారా?"సంతోషంతో ఆతురతతో ఆమె నల్లని పెదవులు వణుకుతున్నాయి. చెయ్యి కొంచెం చాచింది.

రాత్రికాగానే ఆడవాళ్ళలో అందంకూడా ఎక్కువగా కనబడుతుంది. అందులో ముఖ్యం నల్లనివాళ్ళది. దుమ్మూ ధూళీ కనబడవు.

తెనాలి రైలు కూత కూసింది. ఆమె దగ్గరగా జరిగాను.

"ఇస్తాను. నాకేమిస్తావు" అనేశాను. ఆ చీకట్లోనే ఆమెకర్థమైనట్లు తోచింది. 'మామూలేనేమో' అని నాసిగ్గుకి జవాబు చెప్పుకున్నాను. కాని మామూలైన మనిషేనా! అని నా డబ్బు విలవ కూడా తగ్గి బాధపడ్డాను.

చాలసేపు మాట్లాడలేదు. తర్వాత 'సరే' అంది.

ఆ 'సరే' అనే ఒక మాట నాహృదయంలోనుంచి దూసుకుపోయింది. నన్ను తిట్టినా, సిగ్గుపడ్డా, "అల్లాంటిదాన్ని కాను."

"అన్నా, ఇది ధర్మమా?"

"నీ డబ్బు దాచుకో" అన్నా భరించి ఉందును. కాని, ఆ 'సరే' నన్ను బాధించింది, నిశ్చయం, నిరాశ, తృణీకారం; నిస్సహాయం ఎన్నో స్ఫురించి కలవరపరిచాయి. నోటు చేతులోపెట్టాను. చేతిని గట్టిగా పట్టుకుంది. 'అక్కర్లేదులే' అనాలనిపించింది. దానికికూడా ధైర్యం రాలేదు. తల వంచుకొని ఆ రోడ్డుదుమ్ముకన్నా అధమంగా ఫీలవుతూ పోయాను. ముహూర్తనిశ్చయం చెయ్యడానికన్నా ధైర్యం లేకపోయింది.

మూడురోజుల తరవాత కాఫీహోటలునుండి నేనూ, దీక్షితులుగారూ; సుబ్బారావూవస్తున్నాము. నా తలనొప్పి కుదురుస్తానని దీక్షితులుగారు సూర్య నమస్కారాలు చేయిస్తున్నారు. రెండు పూటలా భోజనం తప్ప పనికిరాదని శాసించారు. ఆ వంకపెట్టి నన్ను యెదురుగా కూచోపెట్టుకొని యిద్దరూ నవ్వుతూ హాయిగా తింటున్నారు. వికారిమొగంతో నేను వెంటనడుస్తున్నాను. సుబ్బారావుకి చాలా సంతోషంగా వుంది నా పత్యం

తటాలున ఆస్పత్రి గోడవెనకనించి ఆమె వచ్చి నాచేతులు పట్టుకుంది. కళ్ళంబడి నీళ్లు చెంపలమీదికివచ్చి రోడ్డుదుమ్మును కరిగిస్తున్నాయి

"నెమ్మదిగావుంది. అన్నంతిన్నాడు" అంది చాలా ఉత్సాహంతో. కళ్ళు నిగ నిగ మన్నాయి యెండలో. ఇంకా నలుగురు పోగైనారు.

సిగ్గుతో, తత్తరపడి 'సరే, సరే' అని నడిచి వెళ్ళిపోయాను. వెనకిరి చూసేప్పటికి ఆమె 'ఇదేమిటా? నేనేం చేశాను కోపం తెప్పించడానికి?' అన్నట్టు చూస్తోంది. విద్య, మా స్నేహితులు, మా పేరు ప్రతిష్టలు ఆ ఇబ్బందులు, ఎరగదు అనుకొని, క్లాసులో ప్రవేశించి, పదిమందికి ఇంపోజిషన్ యిచ్చాను.

రాత్రి రామాయణం చదువుతున్నాను. నాపత్ని విస్తరాకు పారెయ్యడానికి వెళ్ళి, 'అదేదో మళ్ళావచ్చిందండీ' అంది. బైటికి వెళ్ళాను. పచ్చిచప్పున నా కాళ్లు పట్టుకుంది. రోడ్డు దుమ్ములో మోకరించి, అహల్యవలె. "మీకు కోపం తెప్పించాను, ఎట్లానో నన్ను కనికరించాలి."

ఆమె బుజాలక్రింద చేతులువేసి లేవనెత్తడం బాగాఉంది. కాని ఇంటి కెదురుగా మునిసిపాలిటీ వారితో పోట్లాడి లాంతరు స్తంభం వేయించుకున్న అవివేకాన్ని తిట్టుకున్నాను. స్వార్థం కసితీర్చుకోక వదలదు.

"నాకేమీకోపంలేదు. పదిమందిలో మాట్లాడలేకే పోయానుఅంతే."

రోడ్డు యీ చివరా ఆ చివరా, యెదురింటి తలుపూ కనిపెడుతున్నాయి నాకళ్లు. నా చెంపలమీద చేతులు వేసి, 'ఎప్పుడు?' అంది.

"ఈ రాత్రి పదకొండింటికి, యికరిడే నిలుచుని ఉంటాను."

ఆమెకీ యిష్టమే! దొంగ! ఎట్లా దాచిందో! నాకేదో ఉపకారం చేస్తున్నట్టు నటించింది, ప్రేమించింది నన్ను. డ్రెస్, ముఖంలో చదువుకున్న కళ, ఎట్లానన్నా ఆ జాతివాళ్ళని ఆకర్షించి తీరతాయి. తరవాత వాణ్ణి వొదలి నా వెంట పడదుకద! ఎట్లా వొదలించుకోడం? ఆహా, ఎంత ఆతురత! తనకితానే అడిగిందే! ఒద్దులే అని నేనంటే, యేమనేదో! తమాషా చెయ్యవలసింది! ఎట్లానన్నా నా జన్మే వేరు నన్ను వాంఛించని స్త్రీహృదయం ఉంటుందా? ఇది యీ పాడు హిందూదేశమై పోయింది కాని, యింకో దేశమేఐతే, 'నెవార'' వలె అని కలల్లో పడ్డాను - అన్ని వైపులా నేనే, నా ప్రయోజనకత్వమే పద

కొండింటిదాకా.

వొచ్చింది. తలుపు తీసి అరుగుమీద గదిలోకి చప్పుడు కాకుండా తీసుకెళ్ళాను. వెళ్ళగానే నా రొమ్ముకి అద్దుకున్నాను. తలలో తెల్లని పువ్వులు, చీరె వుతికినట్లు కొత్తనీటివాసన. ఇనుమువంటిదేహం కాని; యింకా నా 'సూఫీరిపుల్సు' పోలేదు. అదిగాక ఆ మొదటివలె వాంఛలేదు.

"నీ కిష్టమేనా?"

"పోనిద్దురూ."

"వొదిలేవాణ్ణేమో. "కాని మీకూ...." అంది. ఎందుకు అన్నదో."

"నాకు చాలా కావాలి."

"ఐతే సరే."

చాప పరిచాను. ఆమెని ఆచాపమీద ఆ బూజుమూల పడుకోమనడం నాకు సిగ్గేసింది. పెన్న యిసికలు జ్ఞాపక మొచ్చి నిట్టూర్పు విడిచాను. ఈ గుంటూరులో ఆ ఆశలులేవు. నదిలేని ఊళ్ళో ఎందుకు బతుకుతారో మనుష్యులూ, దేశభక్తులూ, శారదారణ్యులూ!

ఆమె చిరుగులబట్టని దూరంగా పెట్టించాను. రోడ్డుదీపం వెలుతురు పడుతోంది, కాని కిటికీ మయ్యవలసి వచ్చింది. చీకట్లో నవ్వే ఆమెపళ్ళు తెల్లగా కనపడ్డాయి.

"ఏమిటి?"

"ఏం లేదు."

ఏదో నన్ను వెక్కిరిస్తున్నట్టు తోచింది కాని నేను ఆలోచించ లేదు. ఆమె బట్టలే లేకుండా నిలుచుంటే చూస్తున్నాను, నేనాశపడ్డ ఆనందం యేమీలేదు హృదయంలో. తెచ్చుకోవాలని ప్రయత్నించాను. ఆమెవంక చూశాను ఆతురతతో. చందనపు బొమ్మవలె, శిలావిగ్రహంవలె, నిలుచునివుంది. అంత చకరాని వొళ్ళు హంపీలో విగ్రహానికి చూసినట్టు జ్ఞాపకం. కాని ఆనందమేమీ కలుగలేదు.

"రా" నా పట్టువలా 'క్యూరియాసిటీ' పని చేస్తున్నాయి కోరెరా

కన్నా, ఆమెవొంట్లో మెత్తనిస్థలమన్నమాటలేదు, నాకుకొత్తగాఉంది,

లేచి చినిగిన చీరెని తీసుకొని కట్టుకుంటుంది. కొంచెంగా కిటికీ తెరిచాను ఊపిరికోసం.

"మరి యింక నేను వెళ్ళనా ?"

ఏమీ సంతోషమివ్వని ఆ పని యెందుకు చేశానా అని అసహ్యపడుతున్నాను. నాకేమీ సౌఖ్యమివ్వక డబ్బు కాజేసినందుకు వేశ్యమీదవలె కోపంగాఉంది ఆమె మీద, కావలిసే మోసంచేసింది, నామీద కసిచేత. లేచి కోపంతో ఆమె మొగంమీద చెయ్యేశాను, ఆమెనవ్వుతున్నట్లుంది.

"ఎందుకు ?" నా అంతరాత్మ 'గిల్టీ' గా ఉంది.

"ఏమీలేదు," అన్నది,

"చెప్పాలి తప్పదు."

"పోనిద్దురూ."

"కాదు ఒట్టు."

"ఏమీలేదు. ఈ మాత్రానికేనా అంతకోరెక."

సీత సిగ్గుని దాచిన భూదేవి, బద్దలై నన్నూ లోపలికితీసుకో కూడదా ? అంతకన్న అవమానంవుందా మొగవాడన్న వాడికి ? నిజమే, నిజమే ? అన్నదా ఆ మాట ! ఆ మాటకి అర్థం అదేనా !

"మరి నువ్వుచేసినపని న్యాయమేనా ?" అన్నాను కొనవూపిరితో,

"ఏం పని ?"

"నువ్వు చెయ్యనిపని !"

"అంటే ?"

ఎట్లా చెప్పాలోతెలీక వూరుకున్నాను. వెళ్ళబోతూ ఆమె నా చేతిని ప్రేమగా పట్టుకుంది. కృతజ్ఞతతో నేమో ఏమైతేనేం, భగ్నమైన నాఆశ, నా కాపీనం, నా నీచత్వం. అన్నీ కలిసి, ఏంచెయ్యలేక, చప్పున యేడ్చాను. తల్లివలె నాతలని వంచి నున్ననిరొమ్ములమధ్య అదుముకుంది.

"ఎందుకు ?"

"చెడ్డపని చేశాను," అన్నాను.

"ఎందుకు అంత ఆత్రుతపడ్డావు ?"

"నాకోర్కె."

"నేనెందుకు ? నాలో ఏముంది ? పిచ్చి ఎలికలదాన్ని."

"నిన్ను ప్రేమించాను."

"చూడు," నా మొహం యెత్తింది, నా కళ్ళమీద వేళ్ళువేసి.

"మీ జాతికీ మా జాతికి కుదరదు" అని దగ్గరగా నన్ను వొత్తుకుని గట్టిగా ముద్దు పెట్టుకుంది. పరవశత పొందాను. ఇంతమాత్రం ప్రేమ చూపితే, నా ప్రయత్నమంతా అట్లా భంగమయ్యేదా ? అన్యాయం చేసింది. ఇప్పుడేంలాభం అనుకుని ?

"మరి నీకు న్యాయమేనా ?"

"ఏమిటి ?" అన్నది.

"నామీద ప్రేమ చూపకపోవడం ?"

"నీకూ నాకూ ప్రేమ ఏముంది ?"

నోరు మూసుకున్నాను. కాని—

"పోనీ, ఇష్టం లేకపోతేనేం, సహాయం చేసివుండకూడదా"?

పదిహేనేళ్ళెందుకు చదువుకున్నాను ఆ మాత్రం 'ఆర్గ్యూ' చెయ్యలేకపోతే—ఆలోచించింది. చాలా దయగా—"నేనేం చెయ్యను ? మీరు నన్ను రేపందే! మీకు శక్తిలేదు. మీరు వేరు మేము వేరు. అదే మావాడైతేనా!" అని చాలా సంతోషంతో "వారం రోజుల్లో వస్తాడు బైటకి. మా యిద్దరికీ పప్పన్నం పెడతారా!"

తడిసిన అలుకుగుడ్డ మల్లే యింటోకిపోయి మంచంమీద పడ్డాను.

పదుహేనేళ్ళ చదువు, పదేళ్ళ వుద్యోగం, చిన్నతనపు పెళ్ళి సంసారం—నన్ను యెరికల దానికి లోకువచేశాయి. ఆ యెరికలాడు 'నా పెళ్ళాన్నేంచేశా' వని తిరగబడితే, పరిగెత్తాలి పోలీసు స్టేషన్కి.

"నీవు యిన్నివేలు ఖర్చుచేసి, శ్రమపడి, బాగా తన్ని చదువు

చెప్పించడంవల్లనే ప్రయోజకుడి వైనావు" అంటారు పూజ్యులైన పెద్దలు.

ఇదీ నా ప్రయోజకత్వం.

[ఆమె ఈ భాష మాట్లాడలేదు. తెలుగే అదోరకం భారత ప్రయోగాలు వేసింది. చాలసార్లు బూతులు మాట్లాడింది అవసరమైన చోట్ల. కొన్ని మాటలు మరిచిపోయాను. కొన్ని అచ్చులో వెయ్యనీరు. అందుకని నా భాషలో వ్రాశాను ఆమె సంభాషణకూడా.]

# నేనేం చేశాను?

నాకు సంఘంలోంచి వెలి, చర్చిలోంచి వెలి; నాతలిదండ్రులూ బంధువులూ దగ్గరకి రానీరు. స్నేహితులు మొహం తప్పించేశారు. నేను పాపాత్మురాలిని; నా బుద్ధి స్వతహా పాపపు బుద్ధి; తలిదండ్రులు, బోధకులు, భర్త, దేవుడు, యేసుక్రీస్తు, అంతరాత్మ, దేవదూతలు, అందరూ వద్దని నాకు బోధిస్తూవున్నా; కావలసి; పట్టుపట్టి పెడబుద్ధితో దుర్నీతి మార్గంలో ప్రవేశించానని, పుణ్యాత్ముల వుద్దేశ్యం. జరిగిందేమిటో చెప్పనా?

నేను చిన్నప్పుడే కొన్ని సంగతులు నేర్చుకున్నా: మొగపిల్లలకీ ఆడపిల్లలకీ, సృష్టి భేదం కంటే సంఘంలో యెక్కువ భేదం. మొగపిల్లలు చేసిన పనులు అనేకం ఆడపిల్లలకి పనికిరావు. ఒకరితో ఒకరు చనువుగా వుండకూడదు. కొన్నాళ్ళకి ఇంకో సంగతి తెలిసింది, మొగజాతికీ ఆడజాతికీ ప్రబలమైన విరోధం. పిల్లులూ యెలుకలూ, యెట్లానో అట్లాను. పిల్లి యెలుక దగ్గరకి వెళ్ళినా యెలుకకి హాని, యెలుక పిల్లి దగ్గరకి వెళ్ళినా యెలికికే హాని. మొగజాతితో స్నేహముచేసినా, లేక మొగజాతి చేసేపనులు చేసినా, ఆ ఆడదాన్ని మొగజాతి వెక్కిరిస్తుంది. ఆడజాతీ వెక్కిరిస్తుంది. మొగజాతి ఆడజాతిని యెప్పుడూ తరుముతుంది. కొందరు తరమని మొగవాళ్ళుండవచ్చు. అది సకృత్తు. యెలుకను పట్టలేని పనికిమాలిన పిల్లివున్నట్టే. అట్లాంటి మంచి మొగమనిషిని కూడా దగ్గర

చేరనియ్యకూడదు. ఏ నిమిషాన యేంబుద్ధి పుడుతుందో ? అదిగాక దొంగ పిల్లలంటూ వుంటాయి; రుద్రాక్షపిల్లులూ; మడిబట్టల పిల్లులూ, సన్యాసి పిల్లులూ మొదలైనవి. మొగజాతి తరుముతూవుంటే ఆడజాతి తెరచాటున కిటికీలు మూసిన ఇళ్ళల్లోనూ, తండ్రుల వెనకాలా, దాకోవలసిందే. కాని "మీభయం నాకేమి ట"న కూడదు. భయం పడ్డట్టుపడి ముసి ముసి నవ్వులు నవ్వి, సిగ్గుచూపి, ఒక వోరచూపు వొదిలేసి "నేనట్టాంటిదాన్ని కాదు" "మా వాళ్ళతో చెబుతా భద్రం." "నువ్వు అన్నవంటివాడవు." అని తప్పుకోవాలి. "మొగవాళ్ళతో అవసరం నాకులేదు, నా తోవనాది. వాళ్ళతో నా కేంపని ?" అనకూడదు ఆడది. "మొగాళ్ళు నాకుకావాలి. వాళ్ళు లేకపోతే యెట్లా ? నేను నిలువలేను, వాళ్ళు నాకవసరం." అనీ అనకూడదు. అది ఒకప్రబంధ స్త్రీలకేతగింది. తనకి మొగాళ్ళు అకర్లే దనడంతప్పే, కావాలనడంతప్పే, మొగవాడం యెరగనట్టుదాక్కొంటో సిగ్గుపడుతో, ఏడుస్తో, మొగాడిచేత బలవంతం చేయించుకోడం మర్యాద. మొగాడికి చిక్కనూ కూడదు చివరికి చిక్కనూ చిక్కాలి. అదే వేట సరదా.

ఒకటేసాధనం : ఒకటేముక్తి ; పెళ్ళి. ఆడదెందుకు పుట్టిందీ ? పెళ్ళికి. పిల్లల్ని కనడానికి వాళ్ళని పెంచడానికి. తరవాత వాళ్ళకి పెళ్ళిళ్లు చెయ్యడానికి. మొగాళ్ళు అనేక పనులకి పుడతారు - వుద్యోగాలు చెయ్య డానికి. పొలాలు దున్నడానికీ. విద్వాంసులు కావడానికీ. ఆడదిమాత్రం ఒకటేపనికి, ఆపనికి సంబంధించినవాటికి. ఆవు పాలిచ్చేందుకు. యింకెం దుకు ? మా క్రైస్తవుల్లో వుద్యోగాలు చేసే ఆడవాళ్ళున్నారు. అదీ సంసా రముకోసమే. అంతే. పెళ్ళిచేసుకోని ఆడది విచిత్రమైనమనిషి. అనుమానిం పడవలసిన విషయమే. యెంతమంచిదైనా. పెళ్ళి అంటే ఒకమగాడు తనని బలవంతం చెయ్యడానికి ఒప్పుకోవడం. ఒకడే. యెక్కువ కూడదు. ఆ ఒకడూ యావజ్జీవం వుంటాడు. మార్చుకోవడానికి వీల్లేదు. బావుండలేదనకూడదు. బాగుండకపోయినా బాగున్నట్టే నటించాలి. బాగుండ

లేవని మనసులోకూడా అనుకోకూడదు. బజారులో మిఠాయి కొన్నట్టే. ఈ మిఠాయి ముందు రుచిచూచి కొనకూడదు. కొంచెంగా వాసనచూడొచ్చు. లేకపోతే యితరులు వాసనచూచి బావుందనిచెపితే నమ్మాలి. హిందువుల్లో ఆచారమదే. దుకాణంవగ్గిరికీ పోనీరు. మహమ్మదీయులలో దూరాన్నుంచన్నా చూడనీరు. కొన్న తరువాత మిఠాయి తినాలి. తిని తీరాలి. అంతా మింగాలి. ప్రతిరోజూ మింగాలి, లేకపోతే భార్యంటే, ఏమిటి ? లా, సంఘం, అన్నీ మీద విరుచుకు పడతాయి ఒకసారి మిఠాయి కొన్న తరవాత ఇంక తలెత్తి దుకాణాలవంక చూడ కూడదు, తన పొట్లంవంకే వుండాలి కళ్ళు. దుకాణంవాళ్ళు పిలిచినా కళ్ళెత్తకూడదు. వాళ్ళు మంచి దీపాలు వెలిగించి అద్దాలు పెట్టి. చూడ మంటారు. కొత్త మిఠాయి చేశామంటారు. కాని పొట్లం వంకే చూడాలి, యింకోళ్ళ చేతులలో మిఠాయి కాశించకూడదు. 'నాదీ మంచిదే' అనాలి. నామిఠాయి వాళ్ళేవరన్నా. రుచి చూస్తామంటే యియ్యకూడదు. లాకుంటే పోట్లాడాలి. యిదీ పెళ్ళి.

నేను బళ్ళో చదువుకొనేదాన్ని. నాకు పన్నెండేళ్ళప్పుడు ఒక సంగతి జరిగింది. నాకో లెక్క రాకపోతే, మా వీధిలోవున్న ఒక అబ్బాయి దగ్గిరకెళ్ళి చెప్పించుకున్నాను. అది మా నాన్నచూచి "అక్కడ కెందుకెళ్ళావు ? తోటిపిల్ల రాజమ్మ దగ్గర నేర్చుకోపోయావా ?" అని కోప్పడ్డాడు. ఆ అమ్మాయి యిల్లు దూరం అదిగాక ఆపిల్లకి నాకు పోట్లాట. ఆకారణం మా నాన్నకి నచ్చిందికాదు. 'మొగాళ్ళతో నీకేం పని. యీసారి వెడితే వీపు చీలుస్తాన'న్నాడు.

యింకో రోజు మా టీచరు నాతో మాట్లాడుతూ కొంతదూర మొచ్చాడు, మా యిద్దరి వెనకాలా యింకో స్కూలు పిల్లలు యేమిటో కేకలు వేశారు. అది అమ్మతో యెవరో చెప్పారు. నన్ను కొట్టింది. నాన్నతో చెబుతానంది. వొద్దని బతిమాలుకున్నా. కాని నేను చేసిన తప్పే మిటో నా కర్థం కాలా,

యింకోసారి క్రిస్టమస్‌కి వనభోజనాని కెళ్ళాము. పిల్లలం చాల మందిమి ఆడుకొంటున్నాము. ఒక కుర్రాడు. పదిహేనేళ్ళబండ వొచ్చి ఒక చిన్న అమ్మాయి బొంగరం లాకుని తిప్పడం మొదలుపెట్టాడు. ఆ పిల్ల యేడ్చింది. ఆ మొద్దు పరధ్యానంగా వున్నప్పుడా బొంగరం లాక్కున్నాను. వాడు నాతో కలియపడ్డాడు. బొంగరం పావడలో దాచేశాను. యిది మా పాస్టరుగారుచూచి నాన్నతో చెప్పారు. నాన్న ఆ రాత్రి నన్ను కొట్టాడు. యెవరికన్నా సహాయం చెయ్యడానికైనా సరే' మొగజాతితో పోట్లాడకూడదనుకున్నా. ఆ అబ్బాయి నేం చేశారు నాతో కలియబడ్డందుకు? యేమీ అనలేదు. మొగమహారాజు అతని కేం?

యింకొకసారి, నాకుపదమూడేళ్ళున్నప్పుడు. పాష్టరుగారి అమ్మాయి రత్నమ్మకోసం వెళ్ళాను. ఆ అమ్మాయిలేదు. ఆ అమ్మాయికిచ్చిన ప్రైజు పుస్తకాలు చూస్తూ నించున్నా. పాస్టరుగారి మేనల్లుడువచ్చి నన్ను పలకరించాడు - అతన్ని చూస్తే నాకిష్టమే. కాని నా అనుభవం ప్రకారం. సిగ్గుతో మూలకునకిరా. తప్పించుకోడానికి తోవవెతుకుతున్నా. అతడు నన్ను పట్టుకొని ముద్దుపెట్టుకున్నాడు. తప్పించుకుని పారిపోయి వచ్చేశా. రత్నమ్మతో చెప్పా. నవ్వింది. యేదో గొప్ప తప్పుచేశాడనీ, నాకుగొప్ప అపకారం జరిగిందనీ, అట్లాంటి విషయం దాచకూడదనీ, చర్చిలో బోధించిన విషయాలు అవీ జ్ఞాపకం తెచ్చుకుని, చెపితే, ఆ అమ్మాయి నవ్వింది. వాళ్ళ బావమీద పక్షపాతమనుకుని, వెళ్ళి అమ్మతో చెప్పాను. అట్లాంటి సంగతి రత్నమ్మతో చెప్పినందుకు, నన్ను చెడ్డతిట్లన్నీ తిట్టింది, నాన్నతో చెప్పింది. నాన్న నన్ను కొట్టడానికి తాడుతీసుకొచ్చాడు. "ఇట్లాంటి పనులు చేసి మాకపరిదిష్ట తీసుకొస్తావా? అందులో పాష్టరుగారింట్లో? ఆయనికి తెలిస్తే. యింకేమన్నా వుందా? నీ మొహానికి పెళ్ళేట్టా అవుతుంది?" అని వొకటే గోల; నే నేం చేశాను?

యిట్లాంటి విషయాలు కొన్ని జరగడంతోటే, నాకు పెద్ద భయం పట్టుకుంది. మొగాళ్ళంటే, వాళ్ళకు ఆడది చికితే, యేమన్నా చేస్తారు.

చేశారని చెప్తుతుందా. అడదానికేతిట్లూ. వెలీ, నోరుమూసుకొని వుండడం మంచిది. మొగతత్వం చెడదు ; పదహారుపన్నెల 'బంగారం' యేం చేసినాసరే అది పవిత్రమే. 'యేదో చిన్నప్పుడు తిరిగాడు అయిపోయింది, అంటారు. కళ్ళు తెరుచుకుని గొప్ప మతసంస్కర్తలు నీతిబోధకులు, వాళ్ళనీ తమలోకి తీసుకుంటారు, తమ పిల్లల్నిస్తారు. ఆడదానికి అన్యాయం జరిగినా సరే, కొంచెం అనుమానం కలిగినా సరే, కొంచెంగా జాలిపడి. దానికర్మమని వీలైతే, ఆదేంచేసిందని, యిన్నివేదాంతాలుచెప్పి. దూరాన్నుంచుతారు.

నాకు పదిహేనేళ్ళప్పుడు మేమున్న యింటి పక్కన వున్నవాళ్ళు వెళ్ళి యింకెవరో వచ్చారు. మా భాగానికి దానికీ మధ్య తలుపుంది. అది అటూ ఇటూ సాధారణంగా గొళ్ళెంవేసి వుంటుంది. ఆ భాగంలో వున్న వాళ్లు ఒక ముసలమ్మా అమె మనమడూ. వాడికి పద్దెనిమిదేళ్ళు. చదువూ ఏంలేదు. వాడో రౌడీ. రౌడీలతో స్నేహం. అతనూ మళ్ళీ క్రిష్టియన్లలో లెఖే. నన్ను చూసినప్పటినుంచీ ఆ వెంకటస్వామికి నా మీదే కళ్లు. ఒకటి రెండుసార్లు వాళ్ళ గుమ్మంలో నుంచుని నన్ను రమ్మని చెయ్యి వూపాడు. అమ్మతో చెబితే బయటగుమ్మంలో యెందుకు నుంచున్నావని చీవాట్లేసింది.

ఒకరోజు ఆదివారం నాకు తలనొప్పిగావుండి గుడికి (చర్చికి) వెళ్ళలేదు. వొంటరిగా ఇంటో పడుకొనివున్నా. మా యింటికీ పక్క భాగానికీ మధ్యవున్న తలుపు యెవరో వూయించినట్టు చప్పుడైంది. యేమిటా అని లేవబోతూవుంటే వెంకటస్వామి వొచ్చాడు. రాత్రి యేడవుతుంది. దీపమన్నాలేదు. లేచి వెళ్ళబోయినా. అడ్డమొచ్చాడు.

"యిక్కడికి కెందుకొచ్చావు ?" అన్నా.

"నువ్వేగా రమ్మన్నావు ? ఆ గడియ తీసిందెవరు ?'

'ఛా. నేనుకాదుపో అరుస్తా'

'భయమేం ? దగ్గరెవరూలేరు. వున్నా నన్నెందుకు రమ్మన్నావో

కనుక్కుంటాను?' అన్నాడు.

వుత్త బెదిరింపులని తెలుసు. అరిస్తే యెవరన్నావచ్చి రక్షించేవారే గాని యేమొచ్చినా ఆడదానికేగాని మొగాడికి యేం ఫరవాలేదని తెలుసుగా? నేను రమ్మన్నాననే అనుకుంటారు అందరూ. ఒకరూ నా పక్షముండరు. మా నాన్నచేతులో దెబ్బలు. మాట్లాడకుండా వొణుకుతో నుంచున్నా. నన్ను కావలించుకొని లాక్కెళ్లి మంచంమీద పడేశాడు.

* * *

నాన్నా వాళ్లు రాత్రి యెనిమిది కొచ్చేటప్పటికి, యేమీ జరగనట్టు మూలుగుతో పడుకున్నా, అన్నానికన్నా లేవలేదు. నామొహంచూస్తే జరిగిందంతా కనుక్కుంటారని భయం. తెల్లవారిలేచి నేనేమన్నా రూపం మారానేమోనని అద్దంలో చూసుకున్నా. అయిదారు రోజులుదాకా భయం వొదల్లేదు. యింక వెంకటస్వామి బానిసనైనా. అతను యేం చెబితే అది చేసి తీరాలి. అయినా యెప్పుడో వొకప్పుడు కనపడి, స్థలమూ, కాలమూ చెప్పి రమ్మనేవాడు, వెళ్ళితీరాలి. ఆ తలుపు గడియ బిగించా. పూపినా రాకండా—అయినా నా చేత తీయించి. మా వాళ్ళంవరూ పడుకొని వుండగానే. రెండు మూడు సార్లొచ్చాడు. అతనికేం? కనుక్కుంటే నేనే గడియతీసి. తనని రమ్మన్నానంటాడు. మొగాడికేం? అతనికి నాకింటో ఏంపెట్టినా, దాచి, తీసికెళ్ళి యియ్యాలి. డబ్బులు దొంగిలించి తీసుకుపోవాలి, మాట్లాడితే అంతా చెప్పేస్తానంటాడు. నే నబద్ధమంటే నమ్ముతారా? అబద్దమన్నా, నన్ను పరీక్షచేసి కనుకోగలరని నాకు భయముండేది. నాకేంతెలుసు యీ సంగతి? నాతో మాట్లాడిందెవరు? మొగాడి సంగతెత్తితే తన్నేవారేగాని. యింకేమన్నా నాకు చెప్పిన వారున్నారా? కోపమొస్తే వినరాని బూతులన్నీ మాట్లాడేవాడు. నాన్న నాముందే పోనీ యీ విషయాలు నాతో విప్పి చెప్పివుండకూడదు? వెంకటస్వామిని. అతని మురికితనాన్నీ! మోటుతనాన్నీ. చూస్తే నాకు రోత. కాని అన్నీ సహించేదాన్ని—ఒకరోజు రాత్రి తాటితోపులోకి రమ్మన్నాడు. యెవరో

స్నేహితుల్ని తీసుకొచ్చాడు. కాళ్ళమీద పడి యేడ్చా.

అంతా అమ్మతో చెప్పేద్దా మనిపించేది. కాని చెపితే చంపేసి. యింటోంచి, వెళ్ళకొడతారని భయం వేసేది. దానికంటే యీ వెంకట స్వామితో యిబ్బందులేనయం. అతి నీచమయిపోయింది నా బతుకు. నేను నాదాన్ని కాదు. దొంగ చూపు. దొంగచేష్టలు దొంగమాటలు.

చివరికోరోజు తెలిసిపోయింది. వెంకటస్వామి నన్ను బలవంతంగా స్వాధీనం చేసుకొంటూవుంటే అమ్మ వచ్చింది. వున్నదాన్ని వున్నట్టు వొదిలి అతను పారిపోయినాడు. నే నెట్లాంటిస్థితిలోవున్నానో చెప్పలేను. ఒకరె నిమిషం వ్యవధియివ్వకండా అమ్మ నామీద విరుచుకుపడ్డది.

యేమిటని అడగలేదు. మాట్లాడలేదు మళ్ళా అరవదు. ఇదివరకు మల్లే. యెవరైనా వింటారని మళ్ళీ భయం రహస్యంగా, బిగించి. బిగించి. తిడుతో, నన్ను కొట్టింది. జుట్టు పీకింది. గుద్దింది. గొంతుక పిసికింది. వొదిలేసి యాడవడంమొదలుపెట్టింది. నాన్నసంగతి తలుచుకొని ప్రాణాల్లో ప్రాణాలు లేకుండా వొణుకుతున్నా. వొచ్చాడు. పరుగెత్తికెళ్ళి చెప్పింది. తలుపు మూసేసి, కర్రతీసుకొనివొచ్చి దాంతో బాదాడు. నెత్తిపగిలి రక్తం కారుతోంది. వరదల్లా, బిగ్గరగా యేడ్చా. నోరుమూసి గిల్లాడు.

యిన్ని దెబ్బలుతిన్నా. వెంకటస్వామి వొదిలిపోయినాడనే సంతోషం నా హృదయంలో పొంగిపోతోంది. యింక వాణ్ణి మానాన బతకనిస్తాడా? కాని మర్నాడు యేం జరగనట్టు వూరుకున్నాడు వాళ్ళ వాళ్ళతో చెప్పలేదు. వాణ్ని యేమనలేదు. యీసారి వెంకటస్వామి వస్తే మాత్రం చెప్పమన్నాడు. ఒకసారి వొచ్చాడు. యింటో యెవరూలేరు. యింకొకసారి నాన్న దాక్కొని నేను వొంటరిగా వున్నట్టు వుంచాడు. వెంటస్వామి రాగానే, పట్టుకొని, కొట్టడానికి కర్రెత్తాడు.

"వంటిమీద దెబ్బ పడనీ నేను మంచివాణ్ణి కాన"న్నాడు"

"యేం చేస్తావు?"

"యీ సంగతంతా బయలుపెట్టేస్తా"

"పెట్టు. నిన్ను నమ్మేదెవరు? పోలీసుల కప్పజెప్పుతా?"

"నమ్మరు. యీచీటీ చూడండి తనని యేంచెయ్యొద్దని బతి మాలుతూ రాసింది."

నాన్న ఆచీటీ చూసి చింపేశాడు. వెంకటస్వామి నవ్వాడు. అట్లాంటి వతనిదగ్గర యింటో యాభై వున్నాయి' అన్నాడు.

"అవునా?"

'అవున'న్నా.

"మరి నేనేం యెరగనని అబద్ధపుకూత లెందుకు కూశావని, జుట్టుపట్టుకున్నాడు. వెంకటస్వామి నేం చెయ్యలేక, ఆ కోపం నామీదే చూపించాడు. నేలనేసికొట్టాడు. పాపం. ఆ పశువు, వెంకటస్వామి హృదయం మెత్తపడ్డది. నాన్నని పట్టుకుని నెట్టేశాడు.

"ఆ అమ్మాయినట్టాకొడితె, నేనూరుకోను. మీయింటోనుంచిలేవదీసుకుపోతా!" అన్నాడు. నాన్న నోరు వెళ్ళాడేసి తెల్లబోయి చూశాడు అప్పణ్ణుంచి నాకు దెబ్బలు తగ్గాయి. వెంకటస్వామి కిప్పుడు రావడానికి దొంగతనం లేదు. రాత్రి పగలు యిష్టమొచ్చినట్టు వస్తున్నాడు. మా నాన్నా అమ్మా చూడనట్టు వూరుకునే వాళ్ళు. యెవరన్నా బంధువులొస్తే, అతన్ని స్నేహితుడు మల్లే మర్యాద చేసేవారు కూడాను. అమ్మ అతనికోసారి టీ కూడయిచ్చింది. అమ్మా నాన్నా భయం తగ్గిన తరువాత నాకు యెకురావ కష్టంగాలేదు. వెంటస్వామి మీద ఒక విధమైన యిష్టంకూడా కలిగింది, హిందూ ఆడపిల్లలకి యిల్లాంటి భర్తల మీదే కొన్నాళ్ళకి యిష్టం కలగడం లా;

ఆ రోజునుంచీ మావాళ్ళు నాకు పెళ్ళిసంబధాలు తొరతొరగా వెతుకుతున్నారు. ఒకనెలలోగా ఎవరికో ఒకరికిచ్చి కట్టిపెట్టాలని నిశ్చయమయింది. అంత తొందరెందుకో అప్పుడు నాకర్థం కాలేదు. ఒకరోజు నాన్నా అమ్మా మాట్లాడుకుంటున్నారు.

"నెల్లోకాదేమో?"

"అయి తీరాలి, యే నిమషాన యేమవుతుందొ చెప్పలేము,కనుక్కు-న్నావా? యిప్పటి వరకేంలేదు గద?"

"లేదు మొన్న బుధవారమే........"

"రావడం మానడు వాడు. నెలలో దొరుకుతుందా సంబంధం?"

"యెవడో వొకడు. అట్టే దూరం ఆలోచించ వద్దు. దీనిపాడు మొహానికి దొరికిందె గొప్ప"

"అంతగా యిబ్బందేవన్నా తటస్తిస్తే ఈ వెంకటస్వామికే కట్టి పెట్టొచ్చు.

"ఛా, ఛా, వాడికొద్దు, వాడు మాలాడు!"

మేము తెలగ క్రిష్టియన్లం. వాడు మాలక్రిష్టియను వాడికినన్నిస్తే అందరిలో మర్యాద పోతుంది. వాళ్లుచూస్తోవుండగా, నన్ను బలవంతంగా అట్లా వుపయోగించుకోడానికి ఆ మాలక్రిష్టియను పనికొచ్చాడు గాని పెళ్ళిచేసుకోడానికి పనికి రాలేదు.

యీ సంగతి పైకి రాకముందే, నాకు పెళ్ళిచెయ్యాలని మావాళ్ళకి పెద్ద ఆదుర్దా పట్టుకుంది. పాపం, వాళ్ళకి నిద్రలేదు. తిండిలేదు. నాన్న సగమైనాడు, నాకు వాళ్ళని చూస్తే చాలాదిగులేసేది. యెకరూడ వెంకటస్వామి చెప్పేస్తాడో. యెకరూడ ఎవరన్నా చూస్తారో అని భయం. బయటికొచ్చిందా నాకిక పెళ్ళికాదని మావాళ్ళకి తెలుసు. పెళ్ళి కాకపోతే అమ్మా! యెదిగిన ఆడపిల్ల కొంగున కట్టుకున్న నిప్పుకాదూ? కుక్క-ముట్టుకున్న అన్నం బ్రాహ్మలకి పనికిరానట్టు-ఒక మొగాడు ముట్టుకున్న ఆడది, యింకొకడికి పెళ్ళికి పనికిరాదు. పెళ్ళాంగా కాకండా. పనికొస్తుంది. ఆడది చెడిపోతుంది. మొగాడు చెరుపుతాడు. మనసు వకరి మీదవున్నా ఉత్తశరీరాన్ని యింకోరు పెళ్ళిచేసుకుంటారు. శరీరం యింకోరు ముట్టుకున్నట్టు తెలిస్తే, మనస్సు పవిత్రమైన. దివ్యమైన. ఆజన్మాంత. నిరంతర నిర్బంధపాశముతో కట్టిన పెళ్ళి అనిపేరు. యెంత వుదారమైనదిగానీ, ధైర్యశాలి, స్వార్థత్యాగి, నిష్కపటి, భర్తరాలుకానీ, ఆ వొకరూపసితో

చెడిపోతుంది, అబద్ధాలు చెప్పొచ్చు మోసంచెయ్యొచ్చు, నీచమైన సమస్త కార్యాలూ చెయ్యొచ్చు, పరవాలేదు. ఆడవాళ్ళకి బైబిలు "కమాండుమెంటు ఒకటే"

చివరికి హాస్పెటల్ కాంపవుండరు నోకాయన్ని పట్టారు. ఆయన చిన్నవాడేగాని రెండోపెళ్ళి. మొదటినించీ ఆయన నామీద దయగావుండే వాడు. నా పూర్వచరిత్ర చెప్పకండా ఆయన్ని పెళ్ళిచేసుకోడం చాలా కష్టమనిపించింది. మాఅమ్మతో ఆయనతో అంతా చెప్పేస్తా నన్నాను. ఆమాటకి నన్ను చంపేసేటంత మండి పడ్డది. సన్నింటోంచి వెళ్ళగొట్టి స్తామన్నారు. వెంకటస్వామికి పాపం నామీద నిజంగా ప్రేమనుకుంటా తనదగ్గరినుంచి వెళ్ళిపోతానని వొక రోజున ఏడ్చాడు. గూడాను. తనతో లేచివస్తే పెళ్ళిచేసు కుంటానన్నాడు. అట్లానన్నా చేశానుగానే అని దిగు లేస్తుంది. యిప్పుడు. కాని ఆమిషనరితో ఎట్లాచెప్పను? ఆదైవసేవకులా, మా యిద్దరికీ లేచివచ్చిన వాళ్ళకీ, పెళ్ళిచేసేది?

పదిహేనురోజులలో పెళ్ళయింది· నేను నాభర్తయింటికి కాపరా నికి వెళ్ళాను. యీలోపల అప్పుడప్పుడు వెంకటస్వామి మా పుట్టింటి బంధువువలె వచ్చి చూస్తూండేవాడు. కాని నన్నేమీ చెయ్యలేదు. చాల మర్యాదగా బయట కూచొని వెళ్ళేవాడు—నేను ఒకర్తెనీ వున్నాసరే. ఒకరోజున బాగా తాగివచ్చి వెర్రిమాటలు మాట్లాడ్డం మొదలుపెట్టాడు. నాకు పెళ్ళయి వచ్చేసినందుకు తనకు కలిగిన విచారం మరిచిపోవడానికి తాగడం మొదలుపెట్టానన్నాడు, నాభర్తని యెప్పుడో వొకప్పుడు తన్ని నన్ను లాకెళ్ళతాననీ యిట్లా మాట్లాడి కొంచెం తెలివొచ్చిం తరువాత వెళ్ళాడు. ఒకవారంరోజులలో మళ్ళావొచ్చి. డబ్బులిమ్మని ప్రాణంతీశాడు. నేను మొన్న తాగివచ్చిందానికి బాగా చీవాట్లేశాను. నాభర్త వింటే నాకు వచ్చే వుపద్రవం మాటచెప్పాను, డబ్బులిస్తే మళ్ళా యెన్నడూ రాననీ డబ్బు తీసుకువెళ్ళిపోయినాడు; కాని నాలుగైదు రోజుల కోసారి వచ్చి డబ్బు అడిగేవాడు. భయపడీ, జాలేసీ యిచ్చేసేదాన్ని. నా దగ్గర డబ్బయి

పోయింది. ఆయన్ని యింటిఖర్చుకని వూరికే అడగడం మొదలుపెడితే ఆయనకీ అనుమానం తగిలింది. కొన్నాళ్ళకి గిన్నెలియ్యమనీ, నగలిమ్మనీ మొదలు పెట్టాడు. నాతో ఎప్పటివలె మాట్లాడుతున్నాడనుకొని యింటో వాళ్ళేమీ అనుమానపడేవాళ్ళుగాదు. ఒకరోజు నాకాలి గొలుసిచ్చేశాను. నాభర్త ఏమయిందని అడిగాడు. పోయిందన్నా. నా అజాగ్రత్తకి కోప్పడ్డాడు.

"నా గొలుసుకదా? పోతే మీకేమి?" అన్నాను.

"నీది? నీదేమిటి? నువ్వూ నేనూ వొకటికాదూ? అన్నాడు.

"మరి, మీవాచి పారేసుకుంటే నేనేమన్నా అన్నానా?"

"అది నాది. నీకేం?"

"ఇది నాది. మీకేం?"

"నువ్వు, నీవీ, అన్నీ నావే"

యిదో కొత్తసంగతి. నా నగలు నావికావు. అమ్మ యిచ్చినవి కూడా ఆయనవేట. మూడు రోజులలో మళ్ళీ వెంకటస్వామి ప్రత్యక్షం. యెంత బతిమాలినా నే నియ్యను పొమ్మన్నాను. ఆ సాయంత్రం నా పెని మిటి యింటికొచ్చేటప్పుడు వెనకాల వెంకటస్వామికూడా వస్తున్నాడు. నా గుండె గుభేలుమంది. ఆయన వెంకటస్వామిని లోపలికి రమ్మని. మా గది తలుపు గడియవేసి, "యితను తాగి రోడ్డుమీద నీ సంగతి అరుస్తున్నాడు. అదంతా నిజమేనా?" అన్నాడు. వెంకటస్వామికి అప్పుడే తెలివొస్తోంది. సిగ్గుతో నా ముందు తలవొంచుకున్నాడు.

"అతన్నే అడగండి"

"అడిగానులే. నువ్వు చెప్పు."

"చిన్నప్పుడేదో అయిపోయింది" అన్నాను.

"ఈ సంగతి చెప్పకుండా, మించిపోకుండా నన్ను పెళ్ళిచేసు కున్నావా? యింత కుట్రబుద్ధి వుందని నాకు తెలియలేదు.'

ఆయన అప్పగార్నిగూడా పిలిచి ఆలోచనలు మొదలుపెట్టారు.

వెంకటస్వామి యింక యెవరితోనూ చెప్పనని వాగ్దానాలు చేశాడు, కాని తాగుమోతువాణ్ని నమ్మతారా? యిది వూళ్ళో యెల్లాగూ తెలుస్తుంది. పరువు పోతుందని నిశ్చయమైంది, యింక నన్ను వొదిలెయ్యాలి. అట్లాంటి దాన్ని దగ్గరవుంచుకోడమెట్లా? బండి పిలిచి దాంట్లో నాబట్టలు నగయూ పెట్టి నన్ను వెళ్ళిపొమ్మన్నారు. మానాన్నవాళ్ళింటి కనుకున్నా, కాదు. "నాలుగు రోజులుండి రా - మాచెల్లెలిగారింటో యీ అల్లరి అణిగింతర్వాత చూద్దా" మన్నారు. సగందూరం వెళ్ళేటప్పటికి వెంకటస్వామి వొస్తున్నాడు. యిదేమిటన్నా.

"నిన్ను నాకిచ్చేశారు. ఆ నగలుతో హాయిగా కాపరం చేద్దా" మన్నాడు. వాడితో కాపరం యేమిటో నాకు తెలుసు. వాడితో పోట్లాడి. మర్నాడు మధ్యాన్నానికి తిండిలేక, మాడి మావూరు చేరుకున్నా. అందరూ నావంక వికారంగా చూస్తున్నారు. నా పెనిమిటీ వాళ్లూ నేను వెంకటస్వామితో లేచిపోయినానని అపవాదు పుట్టించారు. పెద్దగుంపు పోగైంది. నా పెనిమిటి యింటిదగ్గిర నన్ను నా వొదిన బాగాతిట్టి తోలేసింది. ఆపెట్టెలకఱ్ఱడనే పారేసి, మానాన్నగారింటికి బయలుదేరాను, ఆగుంపంతా వెనకాలొచ్చింది, వాళ్లు నాచెవినిపడేడట్టు అనేమాటలు సరేసరి. మాఅమ్మ తలుపు తియ్యలేదు. పొమ్మంది,

దొరగారు, మీషనరీ దగ్గిరికెళ్ళాను. చూద్దానికి వీల్లేదు. పొమ్మన్నారు. దొరసానికూడా పొమ్మంది. నాకు దిక్కులేక అల్లాడుతూంటే, వెంకటస్వామి వొక్కడె సహాయం చేశాడు. ఒక గుడిశ కుదిర్చిపెట్టి, నాకు సదుపాయాలు కలుగచేశాడు. ఆ సహాయం తీసుకోడం తప్పా? దాంతోటి అందరి అనుమానాలు ధృవపడ్డాయి. ఎవరూ సహాయం చెయ్యరు; చేసినవాళ్ళమీద అనుమానం.

వెంకటస్వామికి తాగుడెక్కువయింది. కాని నాజోలికి రాడు: నా వాకిట్లో కుక్కలాగ పడుకొని కావలి కాస్తాడు. అప్పుడప్పుడు తాగి నన్నిట్లాచేశానని యేడుస్తాడు, నా మీద అతనికి అంతప్రేమని నాకు తెలుసు.

పశ్చాత్తాపంలో దహించుకు పోయి, దూరాన వుంటున్నాడు - నా అమ్మ, పెనిమిటి, స్నేహితులు అందరూ వెలేశారు. ఒకరూ మాట్లాడరు. నన్ను గుళ్ళోకి (ఏచర్చిలోకి) రానీరు. క్రైస్తవగ్గిర్నించి కూడా నాకు వెలి, పుణ్యాత్ములకే ఆక్రిష్టియను మతం. మళ్ళీ యేసు క్రీస్తు పాపాత్ముల కోసం పుట్టాడంటారు. అయినా నేను చేసిన పాపమేమిటి? యేదో చిన్న చిన్న పాపాలు మోసాలూ, కుట్రలూ, స్వార్థపరత్వం. అబద్ధాలూ, యిన్ని చేస్తే క్షమిస్తాడు గాని యిట్లాంటి పెద్దపాపాలు క్షమిస్తాడా యేసుక్రీస్తు ? తక్కిన పాపాలు పశ్చాత్తాపంలో పోతాయి. యిది నేను పశ్చాతాపం పడ్డా పోదు. అయినా యేంచేశానని, దేనికని నేను పశ్చాత్తాపం పడాలి ? బయటికిరాని పాపాలు. తెరచాటువీ, గోడచాటువీ. దేవుడు చూడడు. కాని నలుగురూ అవునంటే నేను చెయ్యక పోయినా సరే, దేవుడు వెలేస్తాడు. మావూళ్ళో గొప్ప జడ్జీ వున్నారు. ఆయనా క్రిష్టయనే. ఆయన పెళ్ళాన్నొదిలేసి యింకోదాన్ని తెచ్చుకొని తనతో వుంచుకొన్నాడు. "నీతేమిటి ? పెళ్ళామేమిటి ?" అని నవ్వుతాడు. మాపాస్టరు. గురువు, మా ఆత్మ అధికారి. యెప్పుడూ ఆయనింటో వుండడం. పాస్టరు భార్యకీ ఆ వుంచుకున్న మనిషికీ అపరిమిత స్నేహం. నా మొహం మాత్రం యెవరూ చూడరు, నేనేం చేశాను ? భర్తతో సుఖంగా కాపరాలు చేస్తో, నా పేరు చెబితే వుమ్మేసే ప్రతివ్రతల్లారా, నేనేం చేశానో చెప్పండి ? నాకు మల్లే మీరూ పుడితే మీరేం చేసేవారో చెప్పండి.



TPL AIDI 8190 BC

| | | | |
|---|---|---|---|
| బృందావనం | — పురాణం | .... | 1-50 |
| తారకమంత్రం | — కవుటూరి | .... | 1-00 |
| విరుద్ధ ఫలితాలు | — ముద్దంశెట్టి | .... | 2-00 |
| తిరిగి రాలేదు | — కె. లింగరాజు | .... | 2-25 |
| ఆత్మార్పణ | — చలం | .... | 2-25 |
| పావురాలు | — కె. సభా | .... | 0-75 |
| కాంతికిరణం | — దిలీప్ | .... | 1-50 |

## కేంద్ర ప్రభుత్వ బహుమాన గ్రహీత

### శ్రీ బి. వి. నరసింహారావు, బి. ఏ., బి. యిడి.

## పిల్లల పుస్తకాలు

| | | |
|---|---|---|
| పాలబడిపాటలు | .... | 0-75 |
| బాలరసాలు | .... | 0-75 |
| చిన్నారిలోకం | .... | 0-50 |
| పూలబాలలు | .... | 0-50 |
| ఆహూ హరిశ్చంద్ర | .... | 0-50 |
| బాలలోకం | .... | 0-62 |
| ప్రియదర్శి | .... | 0-62 |
| నాకథ | .... | 1-00 |



..................... ప్రతులకు .....................

## ప్రజా ప్రచురణలు - ఏలూరు




PRAJA .. ..
PRACHURANALU

ANUSUYA
By CHALAM

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRLA 101 B 190 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 141 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | CI, BCI ,136 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | sandhya |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | no |
| తప్పులు | no |
| పరిస్థితి | good |